సంపాదకుడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి　　సంవత్సరం చందా ౨—౦—౦

# ప్రబుద్ధాంధ్ర

సంపుటం ౮ }　　రాజమండ్రి ౩౦ జూన్ ౧౯౩౮　　{ ౧౦ వ సంచిక

## ఉదాహరణ

గూడుమారినకొత్తరికం వెల 0-2-0. దానికి పోస్టుఖర్చులు 0-0-9 ఈ 0-2-9 లు ముందు మాకు లేబిల్సు రూపంగా పంపడానికి కవరు ఖరీదు 0-1-0 కలంపోటుకీ, తర్జిప్రాగానికీ ఇలాగే లేబిల్సు పంపడానికి ఒక్కొక్క కవరు వెల ఒక్కొక అణా.

## ఇదేమి లాభమూ ?

కనక, మాకు, ముందు 2-0-0 పంపండి. పుస్తకాల వెలలకూ, పోస్టేజీకీ అది సరిపోయే దాకా, ఒక్కొక్కటే అచ్చుపడినవెంటనే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు మీకు పంపుతూ వుంటాము. దీనివల్ల ప్రతీపుస్తకానికీ మీకు అనవసరంగా కవరు ఖర్చు తగలదు

## ఇది లాభం కాదూ ?

బాగా ఆలోచించండి

కళాభివర్ధనీపరిషత్తు—రాజమండ్రి

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

ఇవి యిప్పుడు విడివిడిగా అచ్చు అవుతున్నవి
వెల 100 పేజీలకు 0-4-0 లెక్కున వుంటుంది
తక్కువ వెల 0-1-0 ఎక్కువ వెల 0-4-0

తయారైనవి

1. గూడుమారిన కొత్తరికం వెల 0-2-0
2. కలంపోటు వెల 0-2-6
3. తల్లిప్రాణం వెల 0-2-6

అచ్చులో వున్నవి

1. ఇల్లుపట్టిన వెధవాడబడుచు 2. మార్గదర్శి

ఒకొక్క పుస్తకం వి. పీ. చెయ్యము. వెల, పోస్టేజీ లేబిల్సు రూపంగా పంపినవారికి బుక్కుపోస్టుగా పంపుతాము. దీనికీ దానికీ యిలా పంపుతే పోస్టుఖర్చులు ఎక్కువ అయిపోతాయి. కనక ముందు 2-0-0 చందాగా పంపినవారికి వెలకు, పోస్టేజీకీ ఆ 2-0-0 సరిపోయేదాకా చిన్నకథలపుస్తకాలు ఒకొక్కటి అచ్చుకాగానే పంపుతూ వుంటాము. ఒక సంవత్సరంలో ఈ రెండు రూపాయలూ తీరిపోతాయి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు
కలాభివర్ధనీ పరిషత్తు రాజమండ్రి

## ఆధునికాంధ్రవాఙ్మయం

### శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి

1 రక్షాబంధనం 1-0-0, 2 శ్మశానవాటిక 0-8-0, 3 వారకాంత 0-4-0, 4 గూడుమారిన కొత్తరికం 0-2-0, 5 కలంపోటు 0-2-6 6 తల్లిప్రాణం 0-2-6 7 విజయనగరరాజుల కథలు 0-2-0, 8 చిత్తూరు రాజుల కథలు 0-3-0, 9 ఢిల్లీచక్రవర్తుల కథలు, 0-3-0, 10 గోల్కొండనవాబుల కథలు 0-1-0 11 ప్రబుద్ధాంధ్ర అయిదో సంపుటం గ్లేజుకాగితాలు చిక్కని బైండింగు 2-0-0.

### మునిమాణిక్యం నరసింహారావుగారివి

1 కాంతం కథలు 1-0-0, 2 నేనూ మాకాంతం 0-4-0, 3 ఉపాధ్యాయుడు 0-8-0, 4 వక్రరేఖ 1-0-0.

### మొక్కపాటి నరసింహశాస్త్రిగారివి

1 బారిష్టరు పార్వతీశం కథ 1-0-0, 2 ప్రతిబింబములు 0-12-0 3 ఏకోదకులు 0-8-0.

### రాయప్రోలు సుబ్బారావుగారివి

1 కవితాంజలి 1-0-0, 2 జడకుచ్చులు 1-0-0

### కురుగంటి సీతారామయ్యగారివి

తంజావూరాంధ్రనాయక రాజుల చరిత్ర. 2-0-0

### R. V. R. జగపతీవర్మగారివి

1 పెద్దాపురసంస్థాన చరిత్రము 1-0-0, 2 పద్మనాభయుద్ధము 0-12-0, 3 రామవిలాసము 0-10-0, 4 ఆంధ్రులకథలు 0-10-0, 5 ఆంధ్రదేశకథలు 0-12-0.

### [illegible]కుమళ్ళ అచ్యుతరావుగారివి

విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్ర 1-8-0.

### ప్రకీర్ణకాలు

1 మునిమాపు 0-12-0, 2 వకుళమాల 0-12-0, 3 విరిసెజ్జ 0-8-0, 4 వేయిస్తంభాలగుడిశాసనం 2-0-0, 5 మల్లికార్జునరావ 0-10-0, 6 ఆంధ్రహృదయం 0-8-0, 7 రత్నాపణం 0-8-0, 8 రసాంజలి 0-2-0, 9 వసంతము 0-4-0, 10 నాట్యోత్సవం 1-0-0 11 నాట్యాశోకము 1-0-0, 12 విమర్శక పారిజాతం 1-0-0, 13 ఆంధ్రనాటకసంస్కరణము 0-4-0, 14 తెనుగుతోబుట్టువులు 0-8-0, 15 కవిగారిముసుగడ 0-8-0.

## కలాభివర్ధనీ పరిషత్తు రాజమండ్రి

# శాస్త్రీయ, ఆయుర్వేదీయ, ఔషధములు

## 1 పూర్ణచంద్రోదయం

సకలక్షయలకును, శ్వాసకాసలకును, ఇది, రాజౌషధము. శుక్ర నష్టము కట్టును. రక్తపుష్టి, వీర్యవృద్ధి, నరములకు బిగి కలిగించును. నపుంసకత్వమును పోగొట్టును. సన్నిపాతలనను తగ్గించును. ఉడుకు, తాపము, నిస్సత్తువ, శరీరము ఎండిపోవుట—వీట్లకు చాలామంచిది. శరీరము ముడుతలు పడనీయదు. శిరోజములు తెల్లబడనీయదు. యౌవనమును నిలుపును. జీర్ణజ్వరములు, అంతర్గజ్వరములు, విషమ జ్వరములు పోగొట్టును. పాండువు, ఉబ్బు, కామల తగ్గించును. బలము, కాంతి వర్చస్సు కలిగించును. తులం 12—0—0

## 2 రజతచంద్రోదయం

ఇది శుక్రనష్టము కట్టును. ఉడుకులు నిక్కాకు తగ్గించును. వడ తాపము, అరుచి, గుండెలలో మంట, పైత్యవికారములు, ఛర్ది పోగొట్టును. కండపుష్టి, వీర్యవృద్ధి కలిగించును. శరీర మెప్పుడును ఉడుకుగా నుండువారికి చాలా మంచిది. తులం 3—0—0,

## 3 వైక్రాంతచంద్రోదయము

క్షయ, ఉబ్బసము, పొడిదగ్గు, గుండెలలో బరువు, పోటు తగ్గించును. ఘనీభవించిన కఫము కరిగించి స్రోతస్సులు శుభ్రపరిచి, పిల్లికూతలు పోగొట్టును. తల తిరుగుట, అరోచకము, ఎక్కిళ్లు, తాపము, హృదయదౌర్బల్యము పోగొట్టును. రక్తపుష్టి, వీర్యపుష్టి, బలము కాంతి, వర్చస్సు కలిగించును. తులం 3—0—0

## 4 కాంతవల్లభరసము

ఇది క్షయలకు దివ్యౌషధము. సమస్తపాండువులు, ఉబ్బు, గుల్మము, గ్రహణి, దగ్గు, వగర్పు, జ్వరము, ఛర్ది, యకృత్ ప్లీహాభివృద్ధులు, కామిల, వాతశూల వగైరాలను నిశ్శేషము చేయును. అజీర్తి, అగ్నిమాంద్యము తగ్గించును. అనుపానభేదములతో అనేక రోగముల మీద వాడవచ్చును. తులం 3—0—0

## 5 మహాయోగరాజగుగ్గులు

ఆమవాతములకు, స్త్రీల ఋతుదోషములకు చాల మంచిది. వంధ్యలకు సంతానసంపద కలిగించును. పురుషుల శుక్రదోషములు పోగొట్టును. ముఖ్యముగా నడుమునొప్పి, కీళ్ళపోట్లు శుక్రనష్టవ్యాధిలో కాళ్లులాగుట—వీట్లకు చాలా మంచిది. తులం 2—0—0

## 6 వంటబాలసూర్యోదయము

శ్లేష్మజ్వరములు తగ్గించుటలో పేరు పొందినది. పాండువు, క్షయ, ఉబ్బసము, పొడిదగ్గు, ఛర్ది, అరుచి, అగ్నిమాంద్యము, జీర్ణజ్వరములు తగ్గించును. ప్రమేహములమీదను వాడవచ్చును. తు 3—0—0

## 7 భాగవృద్ధి మహాలక్ష్మీవిలాసరసము

బహుదోషపురస్సరమగు క్షయకున్ను, చిరకాలమునుండి మొండికెత్తియున్న ఉబ్బసమునకున్ను ఇది ప్రత్యేకౌషధము. మరిన్నీ, ఇది, జ్వరము, ప్రక్కలు ముడుచుకొనిపోవుట, దీర్ఘతాపము, నోటినుండి రక్తము పడుట, శూల, వింశతి ప్రమేహములు, చేతులు కాళ్ళు మండుట—వీటిని శీఘ్రముగా పోగొట్టును. అగ్నిమాంద్యము, అరోచకము, ఛర్ది, అతిసారము తగ్గించును. రక్తపుష్టి, వీర్యవృద్ధి, బలము కాంతి కలిగించును. ఏకోత్తరవృద్ధిగా వేసిన విలువగల భస్మములతో ఇది తయారైనది. తులం 8—0—0

## 8 స్వర్ణవంగం

దీనికే హేమసుందరరస మని మారుపేరు. ఇది ప్రమేహములకు సర్వసాధారణమైన ఔషధము. నిక్కాకు, శుక్రనష్టము, రక్తపిత్తము తగ్గించును. కాంతి, మేధ, వర్చస్సు, ఇంద్రియశక్తి వృద్ధి చేయును. జీర్ణించినసెగలకు, స్త్రీల కుసుమలకు వాడవచ్చును. తులం 2—0—0

## 9 షడ్గుణసిందూరం

నిక్కాకు తాపము తగ్గించును. ఆకలి జీర్ణశక్తి హెచ్చించును. కృశించినవారు, వృద్ధిక్షీణనష్టముకల్ల జవసత్వములు ఉడిగినవారు, క్షయ, ఉబ్బసము కలవారు, గర్భిణులు—వీరి కిది చాలా మంచిది. ఉడుకుతో బాధపడు చంటిపిల్లలకు చాలా మేలు చేయును. రక్తపిత్తము, తలపోట్లు, కండ్లమంటలు, పోగొట్టును. తులం 2—0—0

## 10 అభ్రకపంచామృతరసం

నిక్కాకు, అంతస్తాపము, బహిస్తాపము తగ్గించును. అంతర్గత జ్వరములు, పొడిదగ్గు, తలనొప్పి, ఎక్కిళ్లు పోగొట్టును. ప్రమేహములను జయించును. స్త్రీల కుసుమవ్యాధులను, యోనిదోషములను పోనాడి గర్భధారణయోగ్యత కలిగించును. ఉష్ణతత్వము కలవారికి మిగుల హితకరము. తులం 3—0—0

## 11 సూర్యావర్తి

ఛర్ది, అరోచకము, ఎక్కిళ్లు, దగ్గు, అగ్నిమాంద్యము, ఆమ్లపిత్తము, తలతిరుగుట, కడుపుపూత, గుండెదడ, రక్తనిష్ఠీవనము మొదలయినవి తగ్గించును. గ్రహణి కట్టును. గర్భిణీస్త్రీలకు చాలా మేలు చేయును. తులం [illegible]—0

## 12 రజతలోహరసాయనము

కఫోద్రేకములయందు ప్రసిద్ధి పొందినది. జీర్ణజ్వరములు, శూల, ఛర్ది, పాండువు, ఉబ్బు, రక్తపిత్తము, ఆమాసము, అపస్మారము, ఆమవాతము చాల సులభముగా పోగొట్టును. తులం 3—0—0




సంపుటము ౮ ] రాజమహేంద్రవరము ౩౦ జూన్ ౧౯౩౮ [ ౧౧ వ సంచిక

# కథా—కల్పనా

కొడవటిగంటి కుటుంబరావు

కల్పనతో కూడుకున్నది కథ. కథ లేకపోయినట్టయితే సాహిత్యం లేదు. చిన్నకథలూ, నవలలూ, నాటకాలూ, నాటికలూ, గేయాలూ, ఆఖరికి పద్యాలూ—వీటన్నిటికీ కల్పనతో కూడుకున్న కథ అత్యవసరం. ఒకరికి చిన్నకథలూ, మరొకరికి నాటకాలూ, వేరొకరికి గేయాలూ, ఇంకొకరికి పద్యాలూ రుచిస్తవంటే దానికి కారణం ఆయా వ్యక్తులకు ఈభిన్నస్వరూపాలకు చెందిన శిల్పంమీద కల అభిరుచిభేదమే. కావ్యప్రయోజనం లోకసంగ్రహమే నని నమ్మే పెద్దలు పైశిల్పానికి అక్కే ప్రాముఖ్యము ఇవ్వ రనుకోవాలి.

ఎంత లోకసంగ్రహం గురించి మాట్లాడేవారైనా తప్పనిసరిగా గగనమార్గం వదిలి కిందికి వచ్చి నలుగురితో పాటు తమ అభిరుచులను గురించి ప్రకటించుకోవటం తప్పు కాదు. మరీ ఇంటిదగ్గిర కూడా కలెక్టరే అయితే మటుకు ఏమంత బాగుంటుంది గనకా?

కాని నాకు పద్యాలంటే అభిమానం గనక నేను కథలను గురించి అసహ్యంగా మాట్లాడటం నాఅభిరుచిని ప్రకటించటానికి వింతమార్గం అవుతుంది! ఈమాట ఎందుకంటున్నానంటే నవ్యసాహిత్యానికి స్తంభంలాటి ఒకానొకరు నాతోనే "ప్రతిభలో కథలు లేకుండా చెయ్యాలని ఉంది. కాని పడటం లేదు!" అన్నారు. పడటం లేదన్నది వారు ఎంతో ఆతురతతో అన్న ముక్క. వారు తలుచుకుంటే కథకు "ప్రతిభ" లోనే కాదు నవ్యసాహిత్యంలోనే మంచితీర్థం పుట్టకుండా పోతుంది. ఏమీ సందేహం లేదు.

నవ్యసాహిత్యాన్ని గురించిన ఆవేదన ఏఇతరుడికైనా ఉన్నదానిలో సగంపాటు నాకుకూడా లేకపోలేదు. కాని ఈవిషయంలో నేను నాఅభిరుచులను ప్రచారంచెయ్యటానికి ఎంత జంకుతానో ఇతరుల అభిరుచులను పాటించటానికి కూడా అంత అశ్రద్ధగా ఉంటాను. ఏఒక్కరి అభిరుచిని పురస్కరించుకునీ ఈసాహిత్యం అభివృద్ధి పొందదని నావిశ్వాసం. ఆవిశ్వాసం నానాటికీ బలపడుతున్నది కాని ఇంకొకటి జరగటం లేదు.

కాని చదువుకున్నవారిలో కూడా కథలను గురించి నీరసమైన దృష్టి ఉండటం అనేక వ్యాసాలు వ్రాసిన తరవాత నవ్యసాహిత్యానికింకా దశలో స్థాయి ఏర్పడలేదేమో అనిపించింది.

ఏమంటే, నవ్యసాహిత్యం [illegible] వ్యం. ఇది అందరికీని. ఇందులో [illegible] టలకీ దీక్షితులుగారి పిల్లలకథలకీ నవ్య[illegible] సాహిత్యాన్ని పండితులే రాశారు. [illegible] పండితులుగా కనిపించదలిచినవారు [illegible] దించారు. ఈనాడు అందరికీ [illegible],

అందరి హృదయాలకూ మనస్సులకూ నాటేటట్లాగు రాయిబడుతున్నది. ఈసాహిత్యాన్ని సృష్టించే అర్హత అందరికీ ఉంది. దీన్ని చదివే యోగ్యతా అందరికీ ఉంది. ఈకొత్త ఉద్యమంలో పండితుడు వెనక్కు వెళ్లాడు. గుడిపాటివారూ, మునిమాణిక్యంవారూ, చింతావారూ, శ్రీరంగంవారూ ముందుకు వచ్చారు. శ్రీపాదవారి వంటి పండితులు కూడా తమ పాండిత్యాన్ని పెట్టెలో పెట్టేసి తాళ్ళపుచెవి విసిరివేశారు.

తన కర్తవ్యం లోకసంగ్రహ మని గ్రహించింది సాహిత్యం. ఈకొత్తదారి తొక్కిన సాహిత్యానికి అస్పృశ్యులు లేరు. ఇది లోక మంటే ఏమిటో లోకసంగ్రహం ఎట్లా ఉంటుందో తెలుసుకున్న కొద్దీ ఇంకా ఇంకా విస్తృత మవుతుంది కాని గోడలూ గొబ్బెలూ ఎక్కికూర్చుని "నన్ను తాకకు!" అనదు. తెలుగుభావాన్ని అర్థం చేసుకునే మనస్సులూ తెలుగు ఉద్రేకాన్ని అర్థం చేసుకునే హృదయాలూ ఎన్ని ఉన్నవో అన్నింటినీ తాకి వచ్చేదాకా దీనికి ముక్తి లేదు.

ఈసాహిత్యంలో దేనికి అగ్రతాంబూలమో నిర్ణయించవలసింది నేనుకాదు, మరొకరు కాదు—ఈరెండు న్నరకోట్ల హృదయాలూ మనస్సులూనూ. ఆదృష్టితో చూసినట్టయితే కథకే అగ్రస్థానం ఉందో కవిత్వానికే ఉందో తెలుస్తూనే ఉంది. ఈసాహిత్యానికి తట్టుకోలేక నవకవులు మళ్లీ మడులు కట్టడం లేదుకద !

రచనలలో తారతమ్యం ఉండదా? నవ్యసాహిత్యానికి మటుకు కట్టుబాట్లు అవసరం లేదా ? కావాలి. సాహిత్యం ఏఉద్దేశంతో బయలుదేరుతున్నదో ఆఉద్దేశాన్ని సగంలో మరిచిపోవటంలో అర్థం లేదు. జీవి తన ప్రవర్తనను కట్టుబాటు చేసుకోకుండా సార్థకజీవి కాలేడు. ఆ కట్టుబాట్లు తెచ్చిపెట్టుకున్నవాడల్లా సార్థకజీవి అవుతాడని కాదు—సార్థకజీవి కాదగినవాడికి ఆకట్టుబాట్లు తప్పనిసరి. అందుచేత లోకసంగ్రహానికి పూనుకున్న సాహిత్యం కట్టుబాట్లు లేకుండా కాలు కదపలేదు. అవి ఎంత అవసరమైన కట్టుబాట్లంటే, వాటిని మానవుడు నిర్ణయించలేకపోయినపక్షాన కాలమైనా నిర్ణయించుతుంది.

అందులో ముఖ్యమైన కట్టుబాటు శిల్ప, కళాకారణాలవల్ల కలిగేది. భగవంతుణ్ణి ధ్యానించా లనే యావ కలవాడు ఏకాంతంగా కూర్చుని స్మరించుకుంటే తరించకపోడు. వాడే నలుగురిలోకీ వచ్చి, కొందరిని వెంటవేసుకుని భగవంతుణ్ణి గానంచెయ్యదలిచినట్టయితే వాడు గానశాస్త్రాన్నీ కళనీ గుర్తించకుండా ఎట్లా ఉండగలడూ ? వాళ్ళంతా పాడే దానికి రాగమూ, తాళమూ, శృతీ ఉండితీరాలి. ఆమీదట అందులో నిర్వచించరాని దైన కళకూడా ఉండాలి. అది లేకపోతే వాళ్ళ భక్తి శ్రోతలకు అంటువ్యాధి అయిపోదు. శ్రోతల కది అంటువ్యాధి కాకపోయినట్టయితే వాళ్ళు చేసేదంతా వట్టి డంబాచారం అవుతుంది.

రచన అయినా అంతే. ఒకభావం నన్ను దహించినంతమాత్రంచేతనే నేను కవిని కాను. ఆభావాన్ని ప్రకటించే నేర్పూ, కవిత్వకళా నాలో ఉండాలి. నామనసులో ఉన్న భావాన్ని నేను సంపూర్ణంగా, నేను ఏవిధంగా అనుభవించానో ఆవిధంగా పాఠకులు అనుభవించేటట్టు ప్రకటించగలిగినట్టయితే నాకు ఆకళాదృష్టీ శిల్పజ్ఞానమూ ఉన్న వనుకోవాలి. ఏఆలంకారికులో నిర్ణయించిన కట్టుబాట్లు నేను పాటించానా, లేదా అనే సమస్యే రాదు. విమర్శకుడు కూడా కళాదృష్టీ శిల్పజ్ఞానమూ కలవాడయితే ఏశ్లోకాలూ ఏకరువుపెట్టకుండానే ఒక రచనలో ఈసంబంధమైన లోపాలను అర్థంచేసుకోగలడు. రచనయొక్క ఆదర్శం శిల్పాన్ని కళనీ పరిపూర్ణం చెయ్యటమని భ్రమపడడు.

పోతే రచనలో మిగిలేది వస్తువు లేక కథా, దానికి సంబంధించిన కల్పనా.

కల్పనకు సంబంధించిన కట్టుబాట్లు కూడా చాలా ఉన్నై. వాటిని ఈనాటి రచయితలు ఎక్కువగా పాటించకపోవటం చాలా శోచనీయమైన విషయం.

కల్పనను గురించి ఈరెండు విషయాలూ చాలామంది స్పష్టంగా తెలుసుకున్నట్టు కనిపించదు—(౧) కల్పనలో కూడా నిజమూ అబద్ధమూ ఉంటుంది. (౨) కల్పనలో అనుచితమైన కల్పనా అనవసరమైన కల్పనా ఉంటుంది.

హరిజనదంపతులను గురించి రాస్తూ వాళ్ళ ప్రణయాన్ని ఉత్తమసంస్కారయుతంగా చిత్రించితే అది అసత్యపు కల్పన. శ్రీకృష్ణుడి బాల్యాన్ని వర్ణించుతూ మంత్రసాని పిల్లవాడికి ఆముదం ఎట్లా తాగించిందో, పిల్లవాడి శరీరానికి ఆముదం ఎట్లా పట్టించిందో వర్ణించటం అనవసరమైన కల్పన. అనుచితమైన కల్పనకు ఉదాహరణలు సులభంగా ఊహించుకోవచ్చును.

తమకు ఏమేమి అనుభవాలు జరిగితే బాగుంటుందని తోస్తుందో ఆ అనుభవాలను గురించి కలలు కని ఆకలలను కథారూపంగా లోకంమీద పారేసేవాళ్ళూ, తమ శిల్పాన్ని ప్రకటించుకోవటానికని ఎవరికీ అంటని సంఘటనలు కల్పించి కథలు రాసేవాళ్ళూ, లేని సంఘదోషాలను సంస్కరించే వాళ్ళూ కల్పనకు అవసరమైన కట్టుబాట్లను పాటించని తరగతికి చెందుతారు. వీరి సంఖ్య ప్రస్తుతం చాలా జాస్తిగా ఉందనే చెప్పాలి. కాని కొద్దికాలంలో ఈవిషయం లోకం గుర్తించుతుందని నమ్మవచ్చును. ఈనాడు ఏ ఆశయాలు కూడా లేకుండా ఎవరికీ ఉపకరించని కథలు కూడా ప్రకటించే పత్రికలు లేకపోలేదు. పత్రికలు కొనేవారికి సాహిత్యాన్ని గురించి ఏమాత్రమూ అనుభవం లేకపోవటమే కారణం. వీరు మొదటిసారి అచ్చులో తమకు అర్థమయ్యే కథలు చదువుతున్నారు. వారికి అప్పుడే పూర్వానుభవం ఎక్కడినించి వస్తుంది?

కాని బాగా చదువుకున్న వాళ్లు కూడా—ఆమాటకు వస్తే బాగా చదువుకున్న వాళ్లే—"ఈకథలు చదవటానికైతే బాగానే ఉంటాయి కాని, ఈకథల పుస్తకాలు ఒకసారి చదివి అవతల పారవెయ్యటానికి తప్ప ఎందుకూ పనికిరావు. వాటిల్లో మనకు నేర్చుకునే దేమీ కనిపించదు!" అనటం ఇంత సులభంగా తోసివెయ్యవలసిన విషయం కాదు.

మనం నేర్చుకోదగిన ఉత్కృష్టభావాలన్నీ కవిత్వం ద్వారానే నేర్చుకోవాలనీ సామాన్యపు కథలు ఊరికే చదివి అవతల పారవేసేటందుకే పనికివస్తవనీ—ఈవిశ్వాసం మనవాళ్లకు పూర్వసాహిత్యం చేసిన గాయం తాలూకు మచ్చ.

అసంతృప్తి లేకుండా అభివృద్ధి లేదు. మానవప్రకృతిలో ఒక విధమైన జడత్వం ఉంది. దానివల్ల మనం ఎటువంటి పరిస్థితులకు కూడా అలవాటుపడిపోయి తృప్తి అనేది తెచ్చిపెట్టుకుంటాం. ఆతృప్తి మనకు స్వస్వరూపజ్ఞానం లేకుండా చేస్తుంది. రెండు విధాలుగా ఈతృప్తిని మనం దగ్గిర చేరకుండా చెయ్యవచ్చును. ఒకటి—ఆదర్శాలను తదేకంగా మననం చేస్తూ ఉండటం, రెండు—స్వస్వరూపజ్ఞానం సంపాదించటం. ఇందులో మొదటి మార్గం విఫలమయింది. ఇక సాహిత్యానికి రెండవది మిగిలిఉన్నది.

ఈస్వస్వరూపజ్ఞానం మనకు దానంతట అది కలగదు. ఉగ్గుపాలతో రక్తంలో జీర్ణించిన అనాగరికతనూ కుసంస్కారాన్నీ చూపి మనంతట మనం మన జీవితాన్ని మార్చుకోవటం చాలా కష్టసాధ్యమైన పని. అట్లా చెయ్యగలవాడు ఎక్కడో ఒకడు ఉండినప్పటికీ వాడు మాత్రమే బాగుపడగలడు కాని ఇతరులకు వాడివల్ల ప్రయోజనం తక్కువ. అట్లా కాకుండా ఇది ఉమ్మడి కార్యం కింద భావించి జీవితాన్ని ఎవరికి చాతనయిన విధంగా వారు, ఎవరికి చాతనయినంతవరకు వారు విమర్శించి అటువంటి విమర్శ నంతా సాహిత్యరూపంగా పోగువేస్తే అది అందరి ఉపయోగార్థమూ వినియోగిస్తుంది.

ఇక్కడ శుష్కవిమర్శకంటె కల్పన ఎక్కువగా పని చేస్తూ ఉంటుంది. మనం పొద్దున్నే లేచి ఎన్నివందల అనాగరిక కార్యాలు చేస్తామో జాబితా వెయ్యవచ్చును. నలుగురు ప్రయత్నించి కొద్దికాలంలోనే ఆజాబితా పూర్తి కూడా చెయ్యవచ్చును. కాని అది అందరిమనస్సులకూ నాటుకునేటట్టు చెయ్యటం వేరే కథ.

కల్పనవల్ల సజీవపాత్రలను సృష్టించి వాటిచేత మనం రోజూ చేసే పనులే చేయించి వాటిలో ఉన్న అనాగరికత పాఠకులకు ఎక్కించవచ్చును. ఒక నటుడి నటనను ఊరికే విమర్శించటంలోనూ, అదంతా సినిమాతీసి వాడికే చూపించడంలోనూ తేడా లేదా? వట్టి విమర్శవల్ల విమర్శకుడిది పై చెయ్యీ, విమర్శించబడేవాడిది కింది చెయ్యీ అవుతుంది. సరి అయిన కల్పనవల్ల ఎవరిని వారు

విమర్శించుకునేటట్టు చెయ్యవచ్చును. నేను ఊహించగలిగినంతవరకు కల్పనవల్ల సాధించదగినది ఇంతకంటే లేదు.

కళనూ శిల్పాన్నీ ఆధారంగా పెట్టుకుని కల్పన ద్వారా లోకసంగ్రహం చెయ్యటమే సాహిత్యం యొక్క ఆశయ మనుకున్నట్టయితే, నాటకమూ, తప్పితే నవలా, చిన్నకథా—వీటివల్ల జరిగే ఉపకారం లోకానికి పద్యాలవల్లా, గేయాలవల్లా ఎట్లా జరుగుతుందో నేను ఊహించ లేకుండా ఉన్నాను.

నేను పద్యకావ్యాలను అణిచివెయ్యాలని ప్రయత్నించటం లేదు. అవి మానవజీవితానికి పరిపూర్ణత్వం కలిగించున్నై. అనేక కారణాలవల్ల మనహృదయాలు జీవితంలో సంకుచితత్వం పొందున్నై. దరిద్రుడు దయకు దూరుడౌతాడు—ధనికుడూ అంతే. నీతిపరుడు ప్రేమకు దూరుడౌతాడు—నీతిపరుల మని చెప్పుకోనివాళ్ళం కూడా అట్లాగే ఉన్నాం. కవిత్వం—పద్యకవిత్వం— ఈ జీవితలోపాలను సరిచెయ్యగలదు.

ఇంత రాసిన తరవాత కూడా నేను కథను అనవసరంగా ఎక్కువ చేసి పద్యాలను తెలియక తక్కువచేసి ఉండవచ్చు ననుకోవటానికి సిద్ధంగా ఉన్నాను. కాని కథలను తోసివెయ్యటమూ, నిరసనదృష్టితో చూడటమూ ఎవరికీ భావ్యం కాదంటాను. దేనికన్న ఏది ఎక్కువ అయినప్పటికీ ఒక దాని ఉనికి రెండవదాని ఉనికిని నిరాకరించదు—నిరాదరించటం ఎందుకూ?

---



# మత్తకోకిల

రావు కృష్ణశాస్త్రి

ఆ అమ్మాయి, రోజూ సరిగా అదే వేళకు అక్కడకు వస్తుంది. గోదావరి అలలమీద గాలిబంతులు లాగా ఎగరేసుకుంటూ వెన్నెలచారికలు చీకటిదొంతరలను తరమడం మొదలుపెట్టగానే, మోడైపోయిన చెట్టు, ఉగ్గం వేరుమీదనుంచి, మోపిన తల ఎత్తి, నేలను ఆసలా తీసుకుని లేచి, వంతెనమీద నుంచి వచ్చే రైలు పొల్లు కూతలో కలిపి, ఇగుర్చుకుపోయిన గుండెలు విచ్చేటంత కేక పెట్టి, బావురుమనడం, యింటి గుమ్మం ఎక్కి లోపల సముదాయించుకుంటుంది. పవల్లల్లా యింటిని పడి వేయివ్రేరులు ఎత్తిన దానిలాగా తిరుగుతుంది. మౌనంగా సమాధిలో పడిపోయి నట్టు సాలభంజిక లాగా వ్రాలి పోతుంది. మాసినకన్ను సూర్యుడు క్రుంకుతూండగా ... పనుగంత సత్తువతో ... గోదావరి గట్టుకు...ఎండిన మ్రాని మొదలకు...

ఎందుకు వెళుతుందో తెలియదు. ఏమికావాలి? ఏం హాయి అనుభవించాలి?— ఆమెకు కావలసిన వాళ్లే అర్థం తెముల్చుకోలేక ఆప్రశ్నలు వేసుకోవడం మానుకున్నారు. ఎక్కడకు వెళుతుందో, ఎప్పుడు వస్తుందో, గమనించరు. ఏమీ అనరు. కలకలలాడే ముఖాలతో కాని, అవసరం వచ్చినప్పుడన్నా పలుకరించరు.

ఆమె మానాన, ఆమె బ్రతికి బాగుంటే చాలు... ఇష్టంవచ్చినట్టుగా ఉండటానికి ఎవరూ ఏఅభ్యంతరమూ చెప్పరు. కాని పనేమీ చేస్తూన్న దని కాదు వాళ్లవాళ్ల ఆవేదన...ఎంతటి అకృత్యమైనా చేసి, ఆమె మళ్లా బాహ్యస్మృతి తెప్పించుకుంటే, అదే చాలు.

పడుచుపిల్ల...నోరూరించగల వయసులో ఉన్న సంపన్నుల పడుచు ఒంటరిగా వేళగాని వేళ, దొరికినప్పుడు, ఎంత సౌమ్యుడికైనా, నాడి కదనుత్రొక్కుతుంది. ఒకరిద్దరు, మీదుగా రాచుకుపోవడం, చేతికి చేయి కలిపి నిలవేయడం—ఇలాటి సన్నాహాలు చేసి చూశారు. కాని, దారుమూర్తిలాగా, స్పర్శను గమనించకుండా

అడుగు నిలపకుండా, ఏవిధమైన ఖంగారూ లేకుండా... పోయే అమ్మాయి...మీద ఎన్ని భూతాలు ఆడుతూన్నవో అని భయపడి...ప్రాణంమీద ఆశ ఉన్న వాడెవడూ, ఆమెజోలికి రావడం మానివేయడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

'ఎవరమ్మా నీవు!'—ఎంతమంది ఎన్ని చోట్ల ఎన్ని వేళల్లో ఆప్రశ్న ఎన్నిగొంతులతో అడిగారు? జవాబు దొరక్కుండా? ఇదీ వాసిలోనే జను.

'ఎవరా కూర్చున్నది?'—రెండోనాడు ప్రశ్నలో క్రమం మారింది కాని, ఆమె నాలుకం అంతమాత్రాన వినపడలేదు.

'ఎవరంటే...చూస్తావేం!'—రెండురోజులనుండీ ఓపికగా చూస్తున్నాడు, ఆఫీసారీ. లంకలలోకి పిట్టల వేటకు తెప్పవేసుకు వెళ్ళి...ఆకాశం ఎర్రపడిన తరువాత నీటివాలున ఒడ్డుకు చేర్చి వెన్నెల వచ్చేదాకా తెడ్డుతో అలలు రేపుతూ, అనంతంలోకి చూస్తూ కూర్చుని ఉంటాడు ఆవయసుకాడు. ఎగువను గట్టుమీద పడుచు మెసలడం పడికట్టాడు. పలుకరింపులు వినిపించుకోకపోవడం మూలాన ఎవరో జగజంత కదా అని ఏనాటికి కానాడు, నావలో అనుగు కారులో పెట్టేటప్పటికి మునిగిపోయేవాడు. ఒకనాడు, రెన్నాళ్ళు...ఇక కథ కొంచెం ముదరనిద్దామనే ఉత్సాహం వేసింది. దగ్గరకు వెళ్లాడు. వెన్నెల విచ్చగానే, చంద్రబింబం కన్న మెరిసింది ఆమె ముఖం. సూదివార ఎడం లేకుండా పూసుకుని నిలుచున్నాడు. ఆమె చలించలేదు. వల్లమాలిన చొరవ చేసి, పెదవి ఎంగిలి చేశాడు. ముదురుపాకం హల్వాముక్కలాగా అధరం పలుమొనకు ఎదురుతిరిగి గంటును కోరుకుంది. చురుకుకు, ఆమె కళ్లల్లోకి జీవం కమ్ముకు వచ్చింది...చేరలకు మీరిపోయినవి: అతని మీదుగా గోదావరిలోకి చూసింది.

'రావూ...అలలలోనుంచి ఇంకా లేచి రావేం?'

అతనికి అర్థం కాలేదు. తనభయం మాపుకునేందుకు ఆమెను నందిట పట్టుకున్నాడు.

'నీలాగే నేనూ మునిగిపోతున్నాను.'

ఈకేకలతో, ఆసాహసికి వణుకు పుట్టుకువచ్చింది. కాని గంద్రగోళంగా ఆమె విషాద–గాథ అర్థం అయింది.

'మాయ మాతావా...మునిగిన చోటు కూడా దాచేసుకుంటున్నావా?'

ధైర్యం వచ్చి...ముద్దులలో ఆమెకు ఊపిరి బెసగకుండా చేశాడు. వాడిన తామరతూడు లాగా అయిపోయి, వాలిపోతే...చెట్టుముడల జారిపడిచి కారుదగ్గరకు పరుగెత్తాడు.

అయినవాడు...నీటిమీదుగా కాకుండా...కారులోయకాయకేసి...గట్టుదగ్గరకు వచ్చేశాడు. చెట్టు...ఆ మోడు లేదు. నరుకులైన, తుండ్లరాసి చెల్లాచెదరుగా పడి ఉంది. అమ్మాయి జాడ లేదు.

మాసిన సిలువకి ...ఎక్కడికి పోవాలనే ఆలోచన లేకుండానే గట్టుపుచ్చుకుని ఎగువ ఎక్కుతున్నాడు; దూరాన...ఆమె జాడ కనిపించింది. బెదురుగా వెళ్ళాడు. చెంగున లేడిపిల్ల లాగా అతని కౌగిటిలోకి దుమికి,

'వెన్నెల వచ్చినా...ఎంతసేపని నీకోసం వెదకాలి?' అన్నది.

'చీకటి అంటే నాకు భయం'

'నాకూ భయమే.'

'వద్దు. నీకు కావాలంటే నక్షత్రాలు చిదిపి దీపం పెడుతాను. మసకన్న మాట కనిపించదు.'

'సైట'

ఇద్దరూ చెట్టాపట్టాలు వేసుకుని, చిన్నపిల్లలు లాగా గంతులు వేస్తూ పరుగెత్తారు. ఆమె నవ్వు తెరలు తెరలుగా పొర్లి...కారు హారన్‌లో లయించింది. గట్టుమీదికి ఐమూలగా చాలాదూరం వరకూ కారు జంటదీపాలు చీకటిని చీల్చి చెండాడడానికి వెదుకుతూ దాడుతీస్తూన్నవి. దీపమాలిక లాగా, వంతెనమీదనుంచి రైలు–రంయిన పరుగెత్తింది. గోదావరిలో ఉద్ధోలంగా లేచిన కెరటం ఒడ్డుకు రాకుండానే చదునై వెన్నెలలో విరిగినంత మేరా ఒడిదుడుకులతో మిలమిల లాడింది.

---

# మాటవరస

భమిడిపాటి కామేశ్వరరావు

## ౧. భూమియుద్ధాలు

భూమిమీద యుద్ధాలు జరుగుతూనే ఉన్నాయి. యుద్ధం అనేది ఎక్కడా కలికంలో కేనా లేకుండా మాపు మాపాలనే ఆదుర్దాలో గొప్పజాతులవాళ్లు యథాశక్తిగా వీలైనన్ని ఆయుధాలు తయారుచేసుకుంటున్నారు. యుద్ధాల్లో ప్రాచ్యయుద్ధాలూ, అప్రాచ్యయుద్ధాలూ కూడా లేకపోలేదు. ఆంగ్లేయులు ప్రతీచోటా గోడమీద పిల్లివాటంగా ఉంటారని వదంతి. అదిగాక వారిలో వృద్ధజంబుకతుల్యులుగా ఉండే రాజ్యాంగవేత్తలు చాలామంది ఉన్నారని పుకారు. అతిమధురంగా ఉండి ఇవతలవాణ్ణి బుటక వేయించే సమర్థింపు సమాధానాలు చెప్పడానికి వాళ్లకి సాటి లేరు. ఇటీవల అబిస్సీనియా, స్పెయిన్, చీనా దేశాల్లో గదా యుద్ధాలు జరిగింది? వాటిని ఇంగ్లీషువారు ఎట్లాసమర్థించారో చూడండి. 'ఎబిస్' అంటే ఇంగ్లీషులో అఖాతం అనే అర్థం ఉండడంచేతనున్నూ, తమరి కవి అయివున్న డాక్టర్ జాన్‌సన్‌గారు పూర్వాకాలంలో 'రాసిలస్' అనే గ్రంథంలో అబిసీనియా వారిని గాలిలోంచి దిగి ఎవరో తంతారని జోశ్యం చెప్పిఉండడం చేతనున్నూ అబిస్సీనియా పోయింది, మనం ఏంజేస్తాం అన్నారు. ఇక, స్పెయిన్ అనేమాటలో 'పెయిన్' అనగా బాధ రాసిపెట్టి ఉండడంవల్ల స్పెయిన్‌దేశం బాధల్లో పడిపోయింది, ఎవరేం జెయ్యగల్రు, పొమ్మన్నారు. మరి, చీనా అంటే ఇంగ్లీషులో పింగాణీకి రూఢ్యర్థం అవడంవల్ల ఆదేశం ముక్కలుముక్కలు అయిపోతోంది. దేవుడుదిగొచ్చినా ఆముక్కలు అతుక్కోవు, ఊరుకోండి అని అన్వయించి చెప్పేశారు. [ఈరచనచేసిన కొన్నాళ్లకి జర్మనీవారు ఆస్ట్రియాని ఆపోశనం పట్టారు. ఇదివరదాకా మింగుడుపడే దేశాలయొక్క ప్రారబ్ధం గురించి వాపోయే ఇంగ్లీషువారు ఈమాటు మింగే దేశంయొక్క మహిమనే సమర్థించారు. 'జర్మ్' అంటే ఇంగ్లీషులో పురుగు గనుక, జర్మనీవారు తమ చుట్టుపక్క దేశాల్ని (అనగా, లోగడ రైన్‌లాండు నేడు ఆస్ట్రియా, రేపు సుముహూర్తం రాగానే జెకోస్లొవేకియా వగైరాలు) వేటినైనా సరే పురుగుపట్టినట్టు పట్టి కొట్టేస్తారు. మనం కళ్లప్పగించి చూస్తూన్నా సరే, లేక ఒకవేళ దైవాద్యా కళ్లు నెప్పెట్టిన పక్షానికి మూసుగున్నా సరే నామర్దాగాని ప్రత్యవాయువు గాని లేదని రాసిస్తాం అన్నారు.] కాని యుద్ధాల్ని అరికట్టడానికి నానాజాతిసమితి భూమిభూది కల్లా ఉత్కృష్టమైన సంఘం అని కొందరి ఊహ. అది ఉండబట్టే భూమిమీద ప్రజ ఇప్పటిలాగ ఏదో ఒక మాదిరిగా నేనామన్న గలుగుతున్నారు సయం కదూ అని వారనేది. ఇతరులు: అసలు ఈనానాజాతిసమితివల్లే యుద్ధాలు ఎక్కువయినాయి, బహుశ ఆసమితికి తగనిపని కలిపించడానికే యుద్ధాలు మరీ చెప్పినమాట వినకొచ్చి, వెనకటికంటె విస్తారంగానూ పొగరుమోతురకంగానూ అవుతున్నాయని అంటారు. కొందరు; జాతులన్నీ శక్తివంతం అవుతున్నాయి. అంతకంటె ఎక్కువశక్తి ఉంటేనే గాని జాతుల్ని అంకుశపెట్టగల సత్తా సమితికి ఉండదు. జాతులికి చతురంగబలం ఉంటూన్నప్పుడు, వీళ్లని అదుపాజ్ఞల్లో ఉంచడానికి, జాతిసమితివారికి రెట్టికి రెట్టుగా అష్టాంగబలం గాని, తప్పిజారితే పంచాంగబలంగాని ఉండాలి, జాతులకి విషవాయుబలం ఉంటే, జాతిసమితివారికి విషాకాశబలం ఉండాలి. అటువంటి సాధనాలు ఈసమితికి చేకూరడం అసంభవం అయి సమితివారు జాతులకి శత్రోపదేశం చెయ్యడం బరిమీదపడి దోచుగుపోయే రాడీమీద పళ్లూడిన బామ్మగారి తొస్సిబెదిరింపులా ఉంటుందని, నమ్ముతారు. మనస్సులో ఊహ మంచిదైనా దండించే త్రాణ తక్కువైనప్పుడు న్యాయప్రతిపాదన కల్లవార్త. అందుకని, వీరికి కాస్తంత అప్పీలుగా ఒక చిన్న నానాగ్రహసమితి ఏర్పాటయితే యుద్ధం అనేమాట లేకుండా చెయ్యచ్చునని న్యాయప్రియులు పలుకుతూన్నారు. సమితిలో గ్రహాల్ని చేర్చడం మనం అనుకునేటంత కష్టం కాదని వీరి వాదన. ముందు చంద్రుడు. చంద్రుడి దగ్గిరికి 49 గంటల 24 నిమిషాల్లో

వెళ్ళచ్చుట, వెళ్ళి అక్కడ ఒక పార్లమెంటు స్థాపించవచ్చుట, అదివరకే అక్కడ ఏదేనా కాఫీహోటలు గాని ఉన్నట్టాయినా దాన్నే పార్లమెంటుగా ఒప్పించవచ్చుట, తీరా పోసి అదే మిలిటరీ హోటల్ అయితే అదే పార్లమెంటుగా ఒప్పుకోవచ్చుట. ఇల్లానే, అంగారకుడు దగ్గిరికి వారంరోజుల్లో క్షేమంగా జేరవచ్చు ననిన్నీ అక్కడ నీరు ముప్పాతిక మువ్వీసమున్నా నేల పాతిక వీసమున్నా అవడంచేత అంగారకజనం భూమిజనం కంటె అధమం నాలుగురెట్లు శూరీలు బుద్ధిమంతులూ అయి ఉంటారు గనక అంగారకుణ్ణి గ్రహసమితిలో చులాగ్గా చేర్పించవచ్చు ననిన్నీ, శుక్రుడికి ఒక కన్ను లేకపోవడంచేత వాణ్ణి ఒక పక్షానికి లాక్కురావచ్చు ననిన్నీ, సూర్యుడు దూరానికి దుర్నిరీక్ష్యుడుగాని దగ్గిరకెడితే మంచి మోస్తరే అనిన్నీ, బుధుడు సూర్యుడికి కేవలం తెలివిగల సత్తెకాయి గనక వాడి విషయం ఆట్టే ఇబ్బంది ఉండదనిన్నీ, గురుడు శుద్ధ మేష్టరున్నూ వట్టి నాయనా గనక పెండికట్లూ అతనూ మన్ని చూసే సరికే హడిలి మన పక్షం చేరతా డనిన్నీ, సెలవిచ్చారు. ఇక ఒక్క శనిమాత్రం మిగిలిపోతాడు, వాడు కొంచెం పేచీలు పెట్టి సమితిలో చేరడేమో, 'కిందెక్కడో శనిలాగ పోగయ్యాడు గా మరీనూ' అని వాళ్ళ శనివిరగడ చేసుకునైనా సరే, భూమిమీద మరి యుద్ధం అనేది రాకుండా కట్టుదిట్టం చేస్తాగని జ్ఞానులు ఊహిస్తున్నారు. ఇన్ని గ్రహాలయొక్క కూటమి జరిగినప్పుడు భూమి అనేదే ఐపూ ఆనవాలూ లేకుండా పోతుంది గనక, అప్పుడు జరిగే భూమియుద్ధాలు సమేతూ సృష్టికి అందవు కాబట్టి వాటిని అసలే జరగనివాటికింద కట్టుకోవచ్చు, ఆక్షేపణ లేదు, అని దైవజ్ఞులు కూడా పై మాట ఖాయపరుస్తున్నారు. ఆ గ్రహసమితిలో ఉండతగ్గ భూప్రతినిధి ఏజాతి, ఏమతం, ఏభాష వాడు అయి ఉండాలో (పాతరాజులు తోసిరాజు లయ్యారు గనక) నిరంకుశ రాజుల దగ్గిర్నుంచి సిఫారసులు తీసుకుని సిద్ధంచేసి ఉంచడానికి ఒక ముక్తసరు కమిషను ఏర్పాటు చేస్తున్నారు. ఈ కమిషనులో ఎవరెవరు ఉండాలి అనే దాన్ని గురించి ప్రస్తుతం దారుణం అయిన వాదోపవాదం జరుగుతోంది.

౨. విమానం మీద పన్ను

రైలుపడ్డ కొత్తరికంలో, పట్టాలు ఏఊరిమీదుగా పడ్డాయో, ఆఊరివాళ్ళకి కొంచెం గర్రాగా ఉండేది. స్టేషనే పడిం దనుకోండి మహా, ఓ, మరీ ఇదిగా ఉండేది. ఆ చుట్టుపక్క పల్లెటూళ్ళవాళ్ళకి కొద్దిగా చిన్నతనంగా ఉండేది. కాని, విమానం ధర్మమా అని దాని నడక్కి పట్టాలు లేవు. అగ్గి పల్లెటూళ్ళమీంచి కూడా పోతూండడంవల్ల, వాళ్ళకి కూడా కాస్త పదవి హెచ్చింది. టపావిమానాలు తిరుగుతున్న తరవాత చాలా గ్రామాలకి మంచిపేరొచ్చింది. కాని, మునిసిపాలిటీలకి కొంచెం ఆలోచనగా ఉంది. విమానం ఊరుమీంచి వెళ్ళేటప్పుడు, అది మునిసిపల్ హద్దుల్లో వెళ్ళినట్టే అనిన్నీ, అది దారుణమైన నాదం చెయ్యడంవల్ల పన్నుప్రజ లందరికీ పని చెరుపనిన్నీ, 'పైన నడిచే మిమ్మల్ని ఎంజేశాం' అని విమానయజమానులు అనకూడదనిన్నీ, పైకి గాలి యెంతవరకు వ్యాపించి ఉంటుందో అంతమేరలో ఉండే గాలీ—దాని తాలూకు వాసనాది ద్రవ్యాలూ కూడా కేవలంగా మునిసిపల్ సొత్తే అనిన్నీ, అందుచేత హద్దుల్లోంచి వెళ్ళే విమానాలమీద నెలకు ఒక్కొక్కటికి ఇంతా అని పన్ను ఉటుం దనిన్నీ, ఒకవేళ గనుమడకంగా ఎవరేనా హద్దులు దాటించి వెళ్ళే గ్రామల వాళ్ళకి ధ్వనిసుంకం అనే పన్ను ఉంటుం దనిన్నీ, ఒకవేళ ధ్వనిలేని విమానాలు కొద్దిరోజుల్లో వచ్చినా ధ్యానం కనపడడంచేత పన్ను ఆగిపోయి తీరతాయి గనక ధ్యానం సుంకం అని పన్ను ఉంటుందనిన్నీ, ఒక మునిసిపాలిటీ వారు విమానయజమానులకి రాయవలసిందిగా తీర్మానించుకున్నారు. పైకి పంపడంవల్ల ధనానికి పెట్టే మొదనెప్పులకి తాము ఎంతమాత్రం బాధ్యులం కాం అని కూడా వారు ప్రకటించారు. ఒకవేళ విమానంవారు, అందరికంటే పైవారు గనక, ఈచర్య సక్రమం అని ఒప్పుకోక ఉడాయించి పారిపోతే, మరి గత్యంతరం లేదనిన్నీ, అందుకు నేలమీద వాళ్ళే తగు సంజాయిషీ రాతపూర్వకంగా ఇవ్వవలసిఉంటుం దనిన్నీ నరదాగా జనం వచ్చి చూస్తారు గనక వారిదగ్గిర ప్రేక్షకసుంకం తప్పకుండా వసూలు చేస్తాం అనిన్నీ, ఏతద్విషయంలో తగు ఏర్పా

ట్లు చేసి వసూళ్లలో అక్రమాలు జరక్కుండా చూడ డానికి ప్రేక్షకుడు ఒక్కటికి ఇద్దరు గుమాస్తాల్ని—ఒక ర్ని ఒకరు మింగేవాళ్లని—నియమిస్తాం అనిన్నీ, వచ్చిన డబ్బెట్టి దుమ్ముగేగని రోడ్లు వెయిస్తా రనిన్నీ తెలు స్తోంది. ఒకవేళ పైన పోయేవారు ఏఉడుకుమోత్తసం చేతో ఊరిమీద బాంబులు గాని విషవాయువులు గాని వదిలి వెళ్లిన పక్షంలో బస్తీజనం చూడడానికి రాకూడ దనిన్నీ, వస్తే నాసికార్రక్షలతో రావా లనిన్నీ తమ ఆజ్ఞకు విరుద్ధంగా ఉత్తముక్కుల్తో విహరించి విషవాయు వులు పీల్చి గతించినవాళ్ల దగ్గిర నిలబడ్డపాట్న మరణపు పన్ను వసూలు చెయ్యవలసిన అవసరంరావచ్చు ననిన్నీ కూడా వారు చాటించారు.

౩. వార్త

తగుదుం అని తమరు వంకలాగా జీతాలు పుచ్చుగుం టూ, పెద్దలం మళ్లీ మాట్లాడితే దారి చూపెట్టేవాళ్లం అని పేరుపెట్టుగుని ఈమధ్య నలుగురు గొప్పవాళ్లు ఒక యావత్తు సంసారాన్ని చటుక్కున లాక్కెళ్ళి తయారీ లేకుండా నోటీసు లేకుండా భర్తని భార్యని పిల్లల్నీ, పాపం గాని పుణ్యంగాని మరోటిగాని ఎరిగిని వాళ్ళని అమాంతంగా షూట్ చేసి చక్కాపోయారట. మర్నాడు ఆసంసారం వాళ్ళు తమకు పట్టిన పదవికి సంతోషించి, వానికి టీపార్టీ ఇచ్చారట. చచ్చిన వాళ్ళు వళ్ళీ ఎల్లా బతికారా అని ఈవార్త విన్న వాళ్ళు కొందరు శోధపడగా, "ఓరి మీయిల్లు బంగారంగానూ, ఆసంసారంవాళ్ళు చావలే దర్రా. వాళ్ళని 'షూటింగ్' చేసింది ఒక సుప్రసిద్ధఫిల్ము కంపెనీవారు రా బాబూ! టాకీలలోకి వెళ్ళడానికి సజీవు లైనవాళ్ళు ఎవళ్ళైనా సరిపోతా రా! తక్కినవాళ్ళు కూడా పనికొస్తారు గాని స్థాపన, దహన, ఉద్బంధన క్రియల ధర్మమా అని అరికం దొరకదర్రా!" అని గ్రహించుగున్న వాళ్ళు తెలియచెప్పారట!

౪. కల

ఒక ఊళ్ళో ఒక విద్యార్థికి ఈమధ్య ఒకనాటి రాత్రి కలొ చ్చిందిట. అందులో తనకి ప్రస్తుతం పాఠాలు చెబుతూన్న మేష్టర్లంతా ఒకేసారి గతించిపోయినట్లు అనిపించింది ట. ఆసంగతి అతడు తన ముఖ్యస్నేహితుడితో ఒట్టెట్టించు గుని చెప్పాడు. వాడెళ్ళి మార్కులకోసం ఒక మేష్ట రుతో ఈకాస్తా ఊదాడు. ఆమేష్టరు మొదటికుర్రాణ్ణి పిల్చి, 'ఏమోయ్, నేను పోయాను అన్నావుట గా!' అని అడిగాడు. 'నేను అల్లా ఛస్తే అన్లేదండి' అని కుర్రాడు మొరాయించాడు. 'పైగా, అబద్ధా లోటా?' అని కుర్రాణ్ణి మేష్టరు గదమాయించాడు. 'నేను మొత్తం మీద చెప్పినప్పుడు మిమ్మల్ని ఒక్కర్నే అన్నట్టు మీరు దేవుళ్ళాడ్డం ఎందుకు?' అని కుర్రాడు అన్నాడు. వతి నగా సంగతులు మోసే జనం అధికార్లకి ఈజట్టీసంగతి మోసేశారు. ఆమేష్టరు సజీవుడా నిర్జీవుడా అనే సంగతి తేల్చడానికి ఒక ఉపసంఘాన్ని వారు ఏర్పాటుచేశారు. మేష్టరు సంఘసభ్యుల్ని యథాశక్తిగా, వీలైతే వాళ్ళ ఇళ్ళకి కూడా వెళ్ళి దర్శించి, ఆశ్రయించి, తను బతికు న్నట్టే వారు తీర్మానించేలాగు చూసుగున్నాడు. ఈసం గతి ఊరంతా పనగలిసిపోయింది. విద్యార్థు లంతా ఆగ్ర హించి, ఒక మేష్టరు మాత్రుడు తమసాటి విద్యార్థిని అనవసరంగా తూలనాడీ కుడా క్షమాపణ వేసుకోని కారణంచేత తమరికి పాఠాలమీదా, సెలవుకాని రోజుల మీదా, మేష్టర్లమీదా అసహ్యం పుట్టి, సమ్మెకట్టు కట్టి వెళ్ళిపోయారు. చాలా గందరగోళంగా ఉంది. ఈసం గతి పైకి తంతికొట్టి శ్రీ గిరిగారిని అక్కడికి రప్పిస్తా రనిన్నీ, రాజీ కుదరవచ్చు ననిన్నీ అనుకుంటున్నారు.

27—2—38

---

# హిందీ కాదు, బెంగాలీ

"హిందూదేశానికి జాతీయభాషయేదీ?" అనే ప్రశ్నకి "హిందీ కాదు, బెంగాలీ" అని ఝుమాయించి జవాబు చెబుతున్నారు బంగాలీలు.

గాంధీగారి సమ్మోహనాస్త్రం బంగాలీలదగ్గిర గడ్డిపరక కూడా కాలేకపోయింది.

హిందువుల్లోకల్లా సాహిత్యవిజ్ఞానాలలో బాగా ముందుకి వెళ్ళి వున్నారు బంగాలీలు. అది వొక ఆధిక్యంగాగుర్తించుకుని, దాన్ని, చక్కగా పోషించుకుంటున్నారు వారు.

ఇవాళ, హైందవభాషల తారతమ్యం విచారణకి వస్తే మొదట పేర్కొనతగ్గది బంగాలీల భాషే.

అలాంటివారు, సర్వలక్షణసంపన్న మైన తమ మాతృభాష విడిచిపెట్టి యెన్ని మాట్లు లెక్కపెట్టినా వొక్కతులసీదాసు రామాయణం తప్పమరొక పుస్తకం లేని హిందీని అంగీకరించడం సంభవమేనా?

అయితే,

"ఈ ప్రతిఘటన యింతవరకూ యెందుకు కనపరిచారు కారూ!" అంటే అగత్యం యేమిటీ?

లక్నోలోనూ, ఫెయిజాపూరులోనూ, హరిపురంలోనూ, వార్ధా పరిసరాల్లోనూ కాంగ్రెస్సువారూ, హిందూస్థానీలూ కలిసి చేసుకున్న సల్లాపాలన్నీ, బంగాలీలు, ఉన్మాద ప్రలాపాలక్రింద జమకట్టుకున్నారు.

ముస్లిం లీగువారు చేసిన పని గూడా యిదే.

కాని,

కొన్ని శాసనసభ లాక్రమించి, కాంగ్రెస్సువారు, కొంతకాలం పేరట భాగోతం ప్రారంభించగానే, అక్కడ ముస్లిం లీగువారి చంద్రధ్వజం యెత్తినట్టే యిక్కడ బంగాలీలు శంఖారావం చేశారు.

ఆశంఖారావమే యిటీవల "రవివాసర" సమావేశాల సందర్భంలో ప్రకటించబడ్డ తీర్మానం.

"రవివాసరం" అంటే, బంగాలీలలో, సాహిత్యసంస్థలలో వృద్ధంము లైన వారి సంస్థ.

దాని సభ్యుల సంఖ్య యాభై. అది అంతకంటే యెప్పుడూ హెచ్చుగూడ దని గట్టి నియమం వున్నది. అంచేత, హేమాహేమీ లయినవారికే అందులో ప్రవేశం దొరకుతుంది. బంగాలీలలో మహామహావాళ్లెవరయ్యా అంటే, వేరే పరిశ్రమ చేసి తంటాలుపడనక్కర్లేదు, రవివాసరసభ్యుల జాబితా సంపాదించుకోగలిగితే చాలు, సులభంగా తెలిసిపోతుంది.

డాక్టర్. రవీంద్రనాథటాగూరుగారు దానికి అధినాయకులు.

"భారతవర్ష" సంపాదకు లైన రాయ్. జలధరసేన్ బహదూరుగారు దానికి ప్రెసిడెంటు.

"ప్రవాసి" భూతపూర్వసంపాదకు లైన నరేంద్రనాథవసుగారు దానికి సెక్రటరీ.

ఇటీవలే కీర్తిశేషు లైన శరత్చంద్రచటర్జిగారు దాని సభ్యులలో వొకరయి వుండేవారు.

ప్రస్తుతం సభ్యులుగా వున్నవారు,

౧. మోడరన్ రెవ్యూ, ప్రవాసి పత్రికల సంపాదకులు రామానందచటర్జిగారు. ౨. "విచిత్ర" పత్రికాసంపాదకులు ఉపేంద్రనాథగంగూలీగారు, ౩. "శిశుభారతి" సంపాదకులు యోగేంద్రనాథగుప్తగారు. ౪. (రిటైర్డు) ప్రిన్సిపాల్, ఎస్. ఎన్. మైత్ర, ఎం. ఏ. (కాంటాబ్) ఐ. ఇ. ఎస్ గారు, ౫. పండిత అమూల్యచరణ విద్యాభూషణుగారు. ౬. కలకత్తా యునివర్సిటీలో దేశభాషల శాఖ పెద్ద అయిన రాయి బహదూర్. ఖగేంద్రనాథమిత్రగారు.

మరెన్ని మరికొందరున్నూ.

ఈరవివాసరం కొన్ని సమావేశాలు జరిపి, బంగాలీభాషే హిందూదేశానికి జాతీయభాషగా వుండాలని అనేకవిధాల నిర్ధారించి, ధ్రువపరిచి, చివరికి, యీ కింది తీర్మానాలు చేసింది.

౧. ఈ వివాదంలో, హిందీని హిందూదేశానికి జాతీయభాషగా చెయ్యాలని ఇండియన్ నేషనల్ కాంగ్రెస్సూ, హిందీ మాట్లాడే తెగలవారూ చేస్తూ వున్న ప్రయత్నాలను దృఢంగా నిరసిస్తూ, యీ నిరసనలో, ఇండియాలోనూ, బయటా కూడా బంగాలీ మాట్లాడే హిందువులూ, ముస్లిములూ, క్రిష్టియనులూ సానుభూతిసహకారాలు చూపించవలసిందని కోరుతున్నది.

౨. హిందీ అయినా, మరివొక ప్రాంతీయభాష అయినా జాతీయభాష కావడానికి తగిన యోగ్యత పూర్తిగానూ, సమగ్రంగానూ పొందేదాకానూ, విస్తృతి గల ఖండాంతరాల స్త్రీపురుషులలో, అంగీకరించ తగినంత సంఖ్యగలవారు, ఆభాషను వాడుకోగలిగి వున్న నిదర్శనం కానూ, భాషప్రకటనకు, ఇండియా అంతటా యింగ్లీషుభాషే సామాన్యభాషగా వుండాలని నిర్ణయిస్తున్నది.

౩. కాంగ్రెస్సు సమావేశాలలో జరిగే చర్చలన్నీ ఇంగ్లీషులోనూ — తప్పితే — ఆసమావేశం యే ప్రాంతంలో జరుగుతున్నదో ఆప్రాంతంలో వాడుకలో వున్న భాషలలో ప్రముఖ మైన భాషలోనూ జరుగుతూ వుండాలని తీర్మానిస్తున్నది.

ఈతీర్మానాలు ఉపేంద్రనాథగంగూలీగారు ప్రతిపాదించారు.

ఈగోష్ఠి చర్చలలో రెండు విషయాల ప్రాధాన్యం వుండినవి.

౧. భారతదేశానికి జాతీయభాష కావా లంటే బంగాలీకి గల యోగ్యతల కంటే హిందీకి గల యోగ్యతలు ఎక్కువ కావు. పత్రికలలోనూ, వేదికలమీదనూ మూగపుపట్టులతో ప్రచారం చేసి, కొందరు, హిందీభాషే తగిన దని ప్రజలను మభ్యపెట్టారే గాని నిజానికి, హిందీ, యేంతమాత్రమూ తగినదికాదు. బంగాలీ భాషే తగినది.

పండిత అమూల్యచరణ విద్యాభూషణుగారున్ను, యోగేంద్రనాథగుప్తగారున్నూ "హిందీకి లేని ప్రాముఖ్యం కనపడడానికి ప్రచా

రసాహిత్యం పుట్టించిన” అనీ, “సర్వలక్షణసంపన్నమైన బంగాళీకి అది లేక దానికి వున్న యోగ్యతలే వెల్లడికాలే” అనీ చెప్పారు.

ప్రఫుల్లకుమార సర్కారుగారు, ఇది బంగాళీల అమాయికస్థితికి నిదర్శనం అన్నారు.

౨. ౩, ౪, ఉపన్యాసాలలో స్పష్టపరచినట్టు హిందీని గాని, బంగాళీని గాని భారతజాతీయభాషగా అంగీకరించడాని కిది సమయం కాదు. హిందీ గాని, మరొక భాష గాని జాతీయభాష కావడానికి తగిన సకల యోగ్యతలూ సంపాదించుకునే దాకా స్వతంత్ర భారతానికి ఇంగ్లీషు సామాన్యభాషగాయి వుండాలి.

ఈనాడు, హిందీని భారతజాతీయభాషగా చెయ్యడం కాంగ్రెసు కూడదో అనుకొన్న ప్రమాణాలు ఇలా నిరూపించింది.

ఆనందబజారుపత్రికకు సంబంధించిన ప్రఫుల్లకుమార సర్కారుగారేం చెప్పారంటే!

“హిందీ బంగాళీ భాషలను మాట్లాడే — లేక — అర్థం చేసుకునేవారి సంఖ్యనుబట్టిన్నీ, వాటి సారస్వతముల ఔన్నత్యమునూ, భావప్రకటన సౌలభ్యమునూ బట్టిన్నీ మాత్రమే హిందీకి కంటే బంగాళీకి యోగ్యత యెక్కువగా వున్నది. బంగాళీ మాట్లాడేవారి సంఖ్య ౫ కోట్లు. హిందీ మాట్లాడేవారి సంఖ్య ౧౧ కోట్లు. అయితే, యీ ౧౧ కోట్లు అనేది సరియైన లెక్క కాదు. అనేక ఉపభాషలను కలిపి హిందీ అంటున్నారు. బంగాళీ విషయంలో కూడా అలాంటి లెక్క అంగీకరిస్తే బంగాళీ యింకా చాలా పెద్దదిగా వుంటుంది. బీహారులో నాయకులలో వున్న హిందీకిన్నీ, రాజపుత్తానాలో నాయకులలో వున్న హిందీకిన్నీ ఏమీ సంబంధం లేదు. దక్షిణదేశీయులకు హిందీ సులభంగా వస్తుందనడం, నాకు, బంగాళీ అంతకంటే సులభంగా వస్తుంది. మహమ్మదీయుల ప్రాబల్యం లేకుండా చేసుకోడానికి మనవాళ్లు “హిందూస్థానీ” అని కొత్త మాట పెట్టారు. హిందూస్థానీ అంటే యిటు హిందీ, అటు ఉర్దూ కాదు. అది వొక కృత్రిమభాష మే కాక, దాన్ని గాంధిగారూ, నెహ్రూగారూ, రాజేంద్రప్రసాదుగారూ, మన సుభాషచంద్రబోసు, డాక్టరు సునీతికుమార చటర్జీగార్లూ, కూడా పూనుకుని పనిచేస్తున్నారు. సంస్కృతపదాలు చేర్చడాని కవకాశం లేనట్టిన్నీ, భావప్రకటన సౌలభ్యం కూడా శూన్యమైనట్టిన్నీ, సాహిత్యం లేనే లేనట్టిన్నీ భాషను ఇలాగ అభిమానించడం చాలా ఆశ్చర్యకరంగా వుంది. ఆంధ్రయూనివర్సిటీ వైస్‌ఛాన్సలరు, డాక్టరు సి. ఆర్. రెడ్డిగారు ఈ సందర్భంలో యేమి చెప్పారంటే? హిందూస్థానీ మానవకల్పితం. తుదిభాషలలో వలెగా దాన్లో సారస్వతం యేమీ లేదు. చదవండి అని నిర్బంధం చెయ్యడానికి అందులో గ్రంథాలేమీ లేవుకనక విద్యార్థులకు చాలా సుఖకరంగా వుంటుంది. ముస్లిముల ప్రాతికూల్యానికి జడిసే యీ హిందూస్థానీ స్వీకరించబడుతున్నది. బంగాళీ భాషలో విస్తృతి పొందిన సారస్వతం అపారంగా వున్నది. హిందీకంటే, అది, నవీనోత్సాహంతోనూ, గొప్ప ఆశయాలతోనూ వుడుకెత్తుతు వున్నది. బంగాళీ తరవాత మరాఠీ అట్టిది. హిందీకోసం వీటిని ఎందుకు అణగదొక్కాలి?”

ఏదేశానికయినా జాతీయభాష నిర్బంధం కాకూడదు. ఎక్కడా అలా కాలేదు. సులభంగా మాట్లాడడానికీ, రాయడానికీ, చదవడానికీ ఎక్కువ అవకాశం ఉండడమే జాతీయభాష కావడానికి తగిన యోగ్యతలు. హిందీవర్ణమాలకంటే బంగాళీవర్ణమాల చాలా సులభమైనది. బంగాళీకి వొక్కటే లిపి. హిందీకి నాగరితో కలిపి మూడు లిపు లున్నవి. హిందీవ్యాకరణంకంటే బంగాళీ వ్యాకరణం చాలా సులభం. ఏతావతా, మనం హిందీ అని పలిచేది వొక్క భాష కానే కాదు”

వంగీయమహాకోశం (ఎన్‌సైక్లోపీడియా) ప్రధానసంపాదకులైన పండిత అమూల్యచరణవిద్యాభూషణులుగారేం చెప్పారంటే?

“జాతీయభాష కావడానికి హిందీకీ బంగాళీకీ కూడా యోగ్యత వున్నది. అయితే హిందీకంటే బంగాళీ అనేకవిధాల గొప్పది. హిందీ అనేదే భాషకంటే, బంగాళీ, మరాఠీ, గుజరాతీ, సింధీ, పంజాబీ, తూర్పుహిందీ భాషలకు ఎక్కువ నికటసంబంధం కలది. హిందీ గాని, బంగాళీ గాని యెరుగని దక్షిణదేశీయులకు బంగాళీ అతిసులభమైనది. ఇంకొక విశేషం యేమిటంటే? తక్కిన భాషలలో కంటే బంగాళీలో సంస్కృతశబ్దాలు అధికంగా వున్నవి. బంగాళీవాక్యనిర్మాణం, ఇండియా యొక్క తూర్పుపడమర, ఉత్తర భాగాలలో నాయకులలో వున్న భాషల వాక్యనిర్మాణాన్ని సరిగా పోలి వున్నది. హిందీ దేశం అంతటా వ్యాపించుకొనివున్న దని సులభంగానే చెప్పవచ్చు: కాని నిజంగా, ఢిల్లీ, లక్నో, బారల్లీ, మీరటు ఆగ్రా నగరాలలో మాట్లాడే హిందీ దేనికదే భిన్నమైనది కాని వొక్కటి కానేకాదు. హైదరాబాదు రాజ్యానికీ, ద్రావిడభాషలు మాట్లాడే జాతులకు హిందీ పూర్తిగా కొత్తది.”

ఉపేంద్రనాథగంగూలీగారేం చెప్పారంటే!

“పశ్చిమహిందీ అనేది హిందీలో వొక భిన్నశకలం. అదేనా వొకటి కాదు. లిపిలో లాగే భాషలో కూడా అది చాలా విధాల చీలిపోయి వున్నది. ఉపభాషలతో కూడివున్న బంగాళీని, అలాగే వుపభాషలతో కూడివున్న హిందీని పరీక్షిస్తే బంగాళీయే చాలా గొప్పది. బంగాళీకి వొకటే లిపి. హిందూస్థానీకి లిపులు రెండు మూడున్నవి. సారస్వతౌన్నత్యాన్ని చూస్తే భారతీయభాషలన్నిటిలోకీ బంగాళీయే మహోన్నతమైనది. పైపెచ్చు హిందీని గాని, మరివొక భాషను గాని నమ్ముకుని మనమిప్పుడు ఇంగ్లీషుని విడిచిపెట్టడానికి వీలులేదు. అలా విడిచిపెడితే పాశ్చాత్యవిజ్ఞానప్రసారం లేక మనం పూర్తిగా యింకా వెనకపడిపోతాము. హిందీ మాట్లాడేవాళ్లు హిందూదేశం అంతటా వ్యాపించివున్నారని చెప్పడం దారుణమైన అసత్యం. ఏమంటే? అస్సాములోను, ఒరిస్సాలోను, బొంబాయిలోను, అజ్మీర్ మేర్వారాలోను, బలూచిస్థానంలోను, మద్రాసులోను, బరోడాలోను, కొచ్చిను రాజ్యంలోను, హైదరా

బాదులోను, పశ్చిమోత్తరరాష్ట్రంలోను, పంజాబులోను, కాశ్మీరు లోను, మైసూరులోను, రాజపుతానాలోను, గుజరాతులోను, మరు వాడ్వారులోను, ఇంకా అనేక యితరప్రాంతాలలోను హిందీ ఉపభాష కాదు. ఎవరికీ తెలవదు"

శైలేంద్రకృష్ణలా గారేం చెప్పారంటే ?

"ప్రజ లందరూ వొక జాతివారయి వుండడం గాని, వారు ఒకటే భాషను మాట్లాడడం గాని ఏరాజ్యానికీ ప్రధానం కాదు. సైకాలజీకి సంబంధించిన ఏకతమాత్రమే యేకత్వం అనిపించుకుంటుంది. మనకు సామాన్యభాష కావాలనే కూత తప్పుదారికి తీసుకుపోయే కూత గాని మరివొకటి కాదు. ఎలాగేనా హిందీని జాతీయభాషగా చెయ్యాలనే కుట్రే దీనికి మూలం. హిందీ రాజభాషగా చెయ్యాలని వుద్దేశమా, జనసామాన్యపు భాషగా చెయ్యాలని వుద్దేశమా ? పూర్వం వైజ్ఞానికభాష అయిన సంస్కృతమే మనకి రాజభాషగా వుండేది. జనసామాన్యం ప్రాకృతభాషయొక్క భిన్న స్వరూపాలను వాడుకుంటూ వుండేది. భాషా, వాఙ్మయమూ అవినాభావాలు. ఇప్పటి బంగాలీభాషలో సంస్కృతంలో వున్న నిఘంటా వున్నది. మరన్నీ అది హైందవభాషల్లోకల్లా అగ్రపీఠం అధివసించి వున్నది. ఏది యేమయినా, బంగాళాదేశంలో మనం బంగాలీ నేర్చుకోకతప్పదు. ఇంగ్లీషు విడిచిపెట్టడానికి వీలులేదు. హిందీకి సంబంధించిన వుద్యమం మన తలలమీద మూడోభాష తెచ్చి రుద్దుతుంది. ఇంతకీ స్వాతంత్ర్యానికి మన మింకా యెంతో దూరంలో వుండగా, మనకీ జాతీయభాషకు సంబంధించిన యీ బాదరబందీ యెందుకూ ? ఇది గుర్రానికి ముందు బండిని కట్టినట్టున్నది. చివరి కేమయినా, ఏభాషకి మహోజ్వల మైన సారస్వతౌన్నత్యం వుంటుందో అదే మన కెప్పటి కయినా జాతీయభాష కాగలుగుతుంది"

ఈ వుపన్యాసాలు, చాలా క్లుప్తీకరించబడ్డాయి. స్థలాభావం వల్ల లెక్కలూ, వివరణలూ తగ్గించబడ్డాయి.

అయినా కావలసిన విషయం స్పష్టంగానే తెలుస్తున్నది.

అదేమిటంటే ?

బంగాళీలు తమ భాషే జాతీయభాష కావాలని పట్టుదలగా వున్నారు. కొన్ని కారణాలవల్ల అవిషయంలో విక్కచ్చి చెయ్యక పోయినా, వారు, హిందీని మాత్రం అంగీకరించరు. పైగా యింగ్లీషు విడిచిపెట్టరు.

ముస్లిం లీగువారి ప్రాతికూల్యమూ, బంగాళీల వ్యతిరేకమూ, తమిళుల నిరోధమూ కాంగ్రెస్సు వారివాళ లక్ష్యం చెయ్యకపోయినా, యీసామాన్య భాషాప్రశ్న, వారికి, తల ప్రాణం తోకకు తెచ్చేది గాని బులబులాగ్గా పోనిచ్చేది కాదు.

మా అంధ్రసోదరులు ఈ విషయాలు గమనించి అయినా హిందూస్థానీలకు బుద్ధి చెబుతారని నమ్ముతున్నాము. చెప్పరూ ? వారి భావదాస్యమే లోకానికి వెల్లడి అవుతుంది గాని హిందీ యెలాగా డింక కొట్టకమానదు.

(రవివాసరానికి సంబంధించిన వంగీయసారస్వతగోష్ఠిలో జరిగిన చర్చలను పురస్కరించుకుని, ప్రొఫెసర్ ఖగేంద్రనాథసేన్ ఎం. ఏ. గారు, మోడరన్ రివ్యూ పత్రిక మెయి సంచికలో ప్రకటించిన "ఏ నాషనల్ లాంగ్వేజ్ ఫార్ ఇండియా. ది క్లెయిమ్ ఆఫ్ బెంగాలీ" అనే వ్యాసం దీనికి ఆధారం. శ్రీ. సు. శాస్త్రి.)

# వ్యాఖ్యానములు

## అది అర్థం అయి వుంటేనా యిది కావడానికీ ?

"రాజగోపాలాచార్యు లెన్నడు అంధ్రరాష్ట్రమున కడ్డుతగిలెను ? ఆయన వ్యక్తిగతాభిప్రాయము లెట్లున్నను, మదరాసు శాసనసభలో నీ విషయము వచ్చినప్పుడు దానిని పార్టీసమస్యగా అంగీకరించి ప్రభుత్వపరముగనే తీర్మానముపపాదింపజేసి ఏకగ్రీవముగ నామోదింపజేసెను. ఏతమిళుడు గానీ అతీర్మానమును ప్రతిఘటించి మాటాడలేదు. ఇట్లున్నప్పుడు రాజగోపాలాచార్యులను గానీ, తమిళులను గానీ నిందించుటవలని ప్రయోజన మేమో మా కర్థ మగుటలేదు."

సాధనపత్రికా సంపాదకులు పప్పూరి రామాచార్యులుగారిలా అంటున్నారు.

పాఠశాలలోనూ, యింటోనూకూడా పుస్తకాలు ముట్టక, అందువల్ల, పరీక్షాసమయంలో ప్రశ్నలు అర్థం చేసుకో లేని విద్యార్థి స్థితి యిది.

నిజంగా, దయనీయ మైన అవస్థ యిది.

కాని, రాజగోపాలాచార్యులుగారు అంధ్రరాష్ట్ర ప్రయత్నాలకు అడ్డుతగలని చెప్పరూ ?

గాంధిగారితో వియ్యం అందిన తరవాత—కాంగ్రెస్సులో పలుకుబడి యేర్పడ్డ తరవాత, రాజగోపాలాచార్యులుగారు, వేటి కేనా అడ్డుతలిగి వుంటే వాటిలో మొట్టమొదటిదీ, ముఖ్య మైనదీ మన అంధ్రుల విషయం.

అయితే, యిది బోధపడాలంటే ప్రతిభ మాత్రమే వుంటే చాలదు. చరిత్రజ్ఞానం వుండినంతమాత్రానా చాలదు. మొదట "నేను అంధ్రు" డ్ననే స్వస్వరూపపరిజ్ఞానం వుండాలి. తరవాత "నాయెడల యితరులెలాంటి భావంతో వున్నారు ?" అనే జిజ్ఞాస వుండాలి.

ఈయోగ్యతలు వున్నవారికి ఒక్క రాజగోపాలాచార్యులుగారికే గాక, తమిళులకే గాక యీ ప్రాతికూల్యం, కాంగ్రెస్సు నియంతల కందరికీ వున్నదని తెలుస్తుంది.

పోనీ,

నోఛేంజ రయి వుండిన్నీ—శాసనసభాప్రవేశోద్దేశం చివరమాటు కూడా ప్రతిఘటించి వుండిన్నీ రాజగోపాలారిగారు, మద్రాసు అసెంబ్లీయెన్నికలలో యెందుకు పోటీ చేశారు ? అస లెలాంటి స్థితిలో వారు పోటీకి దిగారూ ?

రామాచార్యులుగారీవిషయాలు అర్థం చేసుకోలేదు. అసలు వారీ విషయాలు పరిశీలన చెయ్యనే లేదు.

వెంకటప్పయ్యగారు అంధ్రరాష్ట్రం మాత్రమే నిర్మించకోరుతూ ప్రతిపాదన పంపారు. రాజగోపాలాచార్యులుగారు, దాన్ని తిర

స్వీకరించి, ఆంధ్ర తమిళ కర్ణాటక మళయాళ రాష్ట్రాలు నిర్మించకోరుతున్నట్టు ప్రస్తావం దిద్దారు.

ఏం? అలా యెందుకు చేశారూ?

రామాచార్యులుగారికిదిన్నీ అర్థం కాలేదు. వారు దీనివిషయంలో కూడా తెలుసుకోవాలని ప్రయత్నం చెయ్యలేదు.

"ఏతమిళుడు గానీ అతీర్మానమును ప్రతిఘటించి మాటాడలేదు" నిజమే. ఎందుకు ప్రతిఘటించలేదూ? కాంగ్రెసుతమిళులు, పక్షనిర్ణయం శిరసావహించి వూరుకున్నారనుకుందాం. మరి ప్రతికూలపక్షపు తమిళులను ఈనిర్ణయం బంధించదే? వారున్నూ యెందు కూరుకున్నారు?

ఏమాత్రపు కదలికా లేక సముద్రం శాంతంగా వుందంటే యేమిటో, "యేతమిళుడు గానీ అతీర్మానమును ప్రతిఘటించి మాటాడలే" దంటే అదే.

రామాచార్యులుగారికిదిన్నీ అర్థం కాలేదు. అసలు, వారికీవిషయంలో అనుమానమే కలగలేదు.

ఇలాగ పునాది అంతా విడిచిపెట్టేసి, రామాచార్యులుగారు, "ఇట్లున్నప్పుడు రాజగోపాలాచార్యులను గానీ, తమిళులను గానీ నిందించుటవలని ప్రయోజన మేమి మాకర్థమగుటలే" దనడంలో యేమీ అర్థం లేదు.

పైగా, రామాచార్యులుగారు "రాజగోపాలాచార్యులను, గానీ, తమిళులను గానీ నిందించుట—" అంటున్నారు. ఇది చాలా సాహసంలో చేసుతుంది. చాలా అనుచిత మైనది.

ఆంధ్రరాష్ట్రప్రయత్నాలకూ, ఆంధ్రాభ్యుదయానికీ తమిళుల ప్రాతికూల్యం సామాన్యంగా లేదు.

ఆంధ్రు లైనవా రీసంగతి అనుకోకుండా వుండలేదు.

ఈవిషయం మాటిమాటికీ బహిరంగంగా వుద్ఘాటించడం యెందుకూ అంటే దీనికి తగిన ప్రతిక్రియ చేసుకోవాలని ఆంధ్రుల నందరినీ వుద్బోధించడానికి.

అరవల యీ తీవ్రప్రాతికూల్యం బహిరంగపరచడం నిందయెలా అవుతుందీ?

రామాచార్యులుగారు మద్రాసు ప్రభుత్వంయొక్క ఆదాయవ్యయాలు పరిశీలించారా? వారికవి అర్థం అయినవా?

కాలేదనే చెప్పాలి.

ఇవే కాదు. ఇంకొక ముఖ్యవిషయం కూడా వారికర్థం కాలేదు.

"నిజమునకు తమిళులకు ఆంధ్రరాష్ట్రముమీద నసూయపడుటకు కారణ మేమైననేమి? ఆకారణమును గూడ మనమే ఊహించుచున్నాము. ఆంధ్రదేశమున నున్న ఉద్యోగము లన్నియు అరవలాక్రమించుచున్నారు. ఆంధ్రరాష్ట్ర మేర్పడిన తరవాత అట్టి అవకాశములు తప్పిపోవు ననివారికి సంకటము; కాని లెక్కలను పరిశీలించిచూచిన యెడల ఆంధ్రదేశములో నున్న అరవల సంఖ్యకంటె మూడునాల్గింతలు కూడ అరవదేశమున ఆంధ్రు లున్నారని తేటపడగలదు. అరవ లిచ్చటమూర్ణాళ్ల ఉద్యోగమున నున్నారు గాని తమిళదేశమున ఆంధ్రులుగొప్ప భూస్వాములుగాను, పలుకుబడి గల వర్తకులు గాను ఉన్నారు. మన దేశములో అరవలను మనము ద్వేషించునట్లు తమిళదేశములోని తెలుగువారిని వారు ద్వేషించిన ట్లయిన అక్కడ నున్నవారి గతి యేమి కావలెనో ఆంధ్రనాయకు లూహించినారా?" అంటున్నారు రామాచార్యులుగారు.

ఈప్రశ్న చాలా అసందర్భంగా వుంది.

ఒక పెద్దసీమలో పలుకుబడి గల ప్రముఖులలో ప్రముఖులైనవారు—సవ్యంగా వ్యాఖ్యానం చేసి గడ్డు విషయాలు ప్రజలకు విప్పి చెప్పవలసిన పత్రికాసంపాదకులు సంగతిసందర్భాలేమీ అర్థం చేసుకోకుండా—ఉద్దేశపూర్వకంగానా అనుకోవలసినట్టు ఇలా రాయడం యేమంత బాగా లేదు.

తమిళదేశంలో ఆంధ్రులు ముప్ఫయి లక్షలకు పైగా వున్నారు. నిజమే. అయితే, వారక్కడికి కొన్ని వందల సంవత్సరాలకు పూర్వం వెళ్లారు. అక్కడ స్థిరపడిపోయారు. మళ్లీ తెనుగుదేశానికి వచ్చి కాపురం వుండాలని వారి కెవరికీ వుద్దేశాలు లేవు. వారక్కడ భూస్వాములయి వున్నారంటే—వర్తకులయి వున్నారంటే అవృత్తులవల్ల, వారి శక్తి, మేళ్లు కూర్చినా అవి తమిళదేశానికే సంక్రమిస్తవి. కీళ్లు చేసినా తమిళదేశానికే సంక్రమిస్తవి. భాషను బట్టీ, సంప్రదాయాలను బట్టీ, జాతిని బట్టీ వారాంధ్రులే గాని అచ్చంగా వారు తమిళదేశీయులు. వారికీ మనకీ దృఢమైన అనుబంధం వుందంటే అది రక్తాన్ని సంబంధించి వున్నది; గాని మరొకదానివల్ల కాదు. గవర్నమెంటు, తమిళదేశాన్ని నిర్లక్ష్యం చేసి సౌకర్యాలన్నీ ఆంధ్రదేశానికే కలిగిస్తే వారు చంకలు గుద్దుకోరు. ఎదిరిస్తారు. ఆందోళనం చేస్తారు. లౌకిక విషయాలలో తమిళులతో పాటే వారికీ ముక్తి. వారి విషయంలో మన కున్న ప్రీతీ, వారిని మరిచిపోకుండా వుండడం—వారి భాషను బాగుపడేటట్టు చెయ్యడం—వారి ఆంధ్రత్వానికి బలమైన దోహదం యిస్తూ వుండడం. మనయెడల వారికి గల ప్రీతీ మనవాళ్లే అని మనల్ని భావించడం.

మరి ఆంధ్రదేశంలో వున్న తమిళు లలాంటి స్థితిలో వున్నారా? ఇక్కడ యేకొద్ది సంవత్సరాలో వుంటారు వారు. డబ్బుకోసమే వారిక్కడికి వచ్చారు: గాని వారి దృష్టి అంతా అక్కడ వుంటుంది. ఇక్కడ వుంటూనే, వారు, అక్కడ ఆస్తీ వసతీ వృద్ధి చేసుకుంటారు. ఆంధ్రదేశం, వారికి మాతృభూమి కాదు. ఆంధ్రులు, వారికి, స్వదేశీయులు కారు. తుంగభద్రాప్రాజెక్టుకంటే వారికి మెట్టూరు ప్రాజెక్టు ప్రధానం. ఇక్కడ యేపనీ జరక్కపోతే వారికి లెంగ వుండదు. "అరవ లిచ్చట మూర్ణాళ్ల ఉద్యోగమున నున్నా" రని తామే చెబుతూ, ఆచార్యులుగారిలా అనడంలో సౌజన్యం యేమీ లేదు.

ధోరణి చూడగా, ఆచార్యులుగారికి, మన రాజకీయనాయకులు, మహమ్మదీయుల నే దృష్టితో చూస్తున్నారో, ఆంగ్లేయుల నే దృష్టితో చూస్తున్నారో కాస్తయినా తెలిసినట్టు లేదు.

రామాచార్యులగారికి ఏకారణంవల్లనైనా రాజగోపాలాచార్యులుగారంటే గురుభావం వుంటే యెవరికీ ఆక్షేపణలేదు. అది వ్యక్తిపరం మాత్రమే అయితే యేమీ యిబ్బంది కలగదు. కాని ఆంధ్రరాష్ట్రప్రస్తావన వచ్చినప్పుడు కూడా ఆగురుభావమే పట్టుకుని యిలాంటి వుపదేశాలు చెయ్యడం ప్రశంసాపాత్రం కాదు. శ్రేయస్కరమూ కాదు.

## ఊబిలో దిగిపోతున్న కాంగ్రెస్సు

కాంగ్రెస్సుని పూర్తిగా విడిచిపెట్టెయ్యడం—లేక — తక్కిన వుద్యమాలన్నీ ఆనాకదొక్కేసి—రూపుమాపేసి పూర్తిగా కాంగ్రెస్సులో లీనం అయిపోవడం— ఇప్పుడు పట్టాభి సీతారామయ్యగారికివి రెండేమార్గాలు. మరి గత్యంతరం లేదు. ఉన్నదను కోడం ఆత్మద్రోహం. లేకపోతే ప్రజలకు వంచన. అదీకాకపోతే, దేశం అంతా అసాధారణం అని ఎత్తేస్తూ వుండిన, వారి, ప్రసిద్ధి అలాంటిది కాకపోవడం.

సాధ్యమా, అసాధ్యమా అనే సంగతి అలా వుంచుదాం. గాంధీగారి ప్రాప్యం అదొకమోస్తరు “స్వ” రాజ్యం. ఆంధ్రోద్యమం ప్రాప్యం ఆంధ్రరాష్ట్రం.

ముందు స్వరాజ్యం వస్తుందా, అందులో ఆంధ్రులకు ప్రత్యేక ఘనత యేమీ వుండదు. ఇప్పుడు కాంగ్రెస్సులో లాగే అప్పుడు స్వరాజ్యంలోనూ నామరూపాలుకూడా వుండవు. అలా కాక, ముందు ఆంధ్రరాష్ట్రం యేర్పడుతుందా, ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రం స్వరాజ్యంకంటే యెక్కువ వుపయోగకరం. తరవాత స్వరాజ్యం వస్తే అందులో “నేనూ వున్నా” నని ఆంధ్రుడు తన ప్రాతినిధ్యం ప్రకటించవచ్చు, ప్రకటించగలడున్ను.

కాని వున్నదల్లా యేమిటంటే!

ఆంధ్రరాష్ట్రమూ, స్వరాజ్యమూ వొకదాని కొకటి చుక్కెదురు.

ఆంధ్రరాష్ట్రానికి గల యోగ్యతలను మనం బ్రిటిషువారికి సవివరంగా చెప్పనక్కరలేదు. ఆసంగతులు మనకంటే వారికే యెక్కువ తెలుసు. దేశం భాషాకరాష్ట్రంగా విడిపోయి వుండకపోవడంవల్ల ఝుమాయించి పరిపాలించడానికి వారికేమీ యిబ్బందులు లేవు. కష్టాలయినా సుఖాలయినా అనుభవించేవారు దేశీయులే. ఈస్థితిలో ఆంధ్రరాష్ట్రం కావాలని మనకే పట్టుదల లేనప్పుడు విశీర్ణయ్యాలని వారెలా ప్రయత్నిస్తారూ!

“కొత్తయిండియా శాసనం అలాగే వుంచడమా, మార్చడమా!” ఇది వొక్కటే బ్రిటిషువారికిప్పుడు తీర్చుకోవలసిన చిక్కు.

అలాగే వుంచాలని వారి పట్టుదల. మార్చాలని మన కాంగ్రెస్సు పట్టుదల.

ఇందులో మన పట్టుదల కూడా విశేషంగా వుంటుందా, అంటే మన ఆంధ్రదేశంలో కాంగ్రెస్సే బలమైన రాజకీయపక్షంగా వుంటుందా, “ముందు కొత్తశాసనం మాట తేలనియ్యి” పైకి స్పష్టంగా చెప్పకపోయిగా బ్రిటిషువారి జవాబిది.

ఫెడరేషను, మన కాంగ్రెస్సువారు నిర్దేశించే రూపంతోటే అమల్లోకి వస్తుందా, అప్పుడు దేశం విభాదియ్యడానికయినా, కలిపెయ్యడానికయినా, ఆంధ్రమండలాలను బహిరంగంగానే సముద్రంలోనో కృష్ణానదిలో పూరదొక్కెయ్యడానికయినా మన కాంగ్రెస్సు ప్రముఖులదే అధికారం. బ్రిటిషువారికీ అంతరంగిక విషయాలలో యేమీ జోక్యం వుండదు. అలా కాక —బ్రిటిషువారు తయారు చేసినది చేసినట్టే ఫెడరేషను అమల్లోకి వస్తుందా. అలాంటప్పుడు కాంగ్రెస్సుని నమ్ముకుని మనం చూపించే యీ ప్రాతికూల్యం మనకి దిష్టిపిడత అయి కూచుంటుంది.

ఇలాంటి స్థితిలో, అటు కాంగ్రెస్సే మనకి ప్రధానం అంటూ పట్టాభి సీతారామయ్యగారు, ఆంధ్రరాష్ట్రం కోసం కూడా పని చేస్తున్నా రంటే, సంగతి సందర్భాలు వారేమీ పరిశీలించడం లేదనీ, వారి వల్ల యేమీ కాదనీ, వారిమీద ఆశపెట్టుకున్నవాడం పొరపాటనీ చెప్పడానికి శంకెందుకూ?

పోనీ, కాంగ్రెస్సునే బలపరచకూడదూ! అంటే గాంధీగారి మాయాజాలం భోగపరుచుకోగలిగినవా డెవడూ కాంగ్రెస్సులో చేరలేడు.

పైగా

కాంగ్రెస్సులో సత్యం లేదు. కనక అది నెగ్గదు.

కాంగ్రెస్సులో ధర్మం లేదు. కనక అది నెగ్గదు.

కాంగ్రెస్సులో న్యాయం లేదు. కనక అది నెగ్గదు.

కాంగ్రెస్సులో సౌజన్యం లేదు. కనక అది నెగ్గదు.

కాంగ్రెస్సులో పారదర్శ్యం లేదు. కనక అది నెగ్గదు.

కాంగ్రెస్సులో, గాంధీగారి పెత్తనం వచ్చాక వొక్క గుజరాతీ తనం తప్ప తక్కిన యావద్భారతీయతా వుడిచిపెట్టుకుపోయింది కనక అది యెంత మాత్రమూ నెగ్గదు.

కాంగ్రెస్సు ఇప్పటికే అపాయసంగంలో పూర్తిగా యిరుక్కుపోయి వుంది. ఇక అది విడిపించుకుని బయటపడలేదు. అది నెగ్గదు.

కాంగ్రెస్సుని నమ్ముకుని మనం ఆంధ్రోద్యమమూ, ఆంధ్రరాష్ట్రోద్యమమూ వదులుకోవడం ఆత్మహత్య.

కాంగ్రెస్సు ఇదివరకే మనల్ని తొక్కేసింది. ఇప్పుడదే తొక్కెయ్యబడుతున్నది.

దాని భవిష్యత్తు వుజ్జ్వలంగా లేకపోవడమే కాదు, అంధకారబంధురం అయిపోయి వున్నది.

దాన్ని నమ్ముకుని, అది యేర్పాటు చేసే ఆంధ్రరాష్ట్రం కోసం గుటకలు మింగుతూ, గుడ్లు మిటకరించుకుంటూ కూచోడం బుద్ధి మాలినపని.

## లక్ష్య సూచనలు: కాని వొకటీ నిలవదు

"త్రివిధబహిష్కారం చేస్తే డిసెంబరు 3౧ వ తేదీకి స్వరాజ్యం వస్తుం" దన్నారు గాంధిగారు.

అలాగే, ఆంధ్రశాసనసభ్యులూ, ఆంధ్రమంత్రులూ తమ కార్యక్రమం అంతా తెనుగులోనే జరుపుకుంటే మన స్పీకరు ౨౪ గంటల్లో ఆంధ్రరాష్ట్రం తెస్తారన్నారు పట్టాభిసీతారామయ్యగారు.

ఎంత నిశ్చితమైన నిర్ధారణ!

కాని ఆత్రివిధబహిష్కారం నెరవేరిందా? స్వరాజ్యం వచ్చిందా?

ఈఆంధ్రభాషాకార్యక్రమం గతీ కూడా అంతే, ఆంధ్రరాష్ట్రం గతీ కూడా అంతే.

గాంధిగారది అప్పుడే మరిచిపోయారు. పట్టాభిసీతారామయ్యగారున్నూ అంతే చేస్తారు.

నాయకుల మనుకునేవారు వొకొక్కప్పుడు ఎంతో వ్యంగ్యంగా వుంటారని తోస్తుంది. ప్రపంచం యావత్తూ అప్పుడు వారికి అరచేతిలో వున్నట్టు తోచేటట్టు కనిపిస్తుంది.

లేకపోతే, వారిలాంటి సూచనలు చెయ్యారు.

ఒకవేళ ఆంధ్రశాసనసభ్యులు ఈమాట వినకపోతే యేమిటి? వారు వినినా మంత్రులంగీకరించకపోతే యేమిటి? వారూ అంగీకరించినా ఇతరభాషలవారీపద్ధతి అవలంబించకపోతే యేమిటి? వారూ అవలంబించినా సాంబమూర్తిగారి ప్రయాణం రద్దుచేయించినవారే యీ అల్లరి వర్కింగుకమిటీవారికి తెలియచేసి మందలింపులు తెప్పించితే అప్పుడేమిటి?

ఇవి యెవరి కయినా కలిగే సందేహాలు. కాని పట్టాభిసీతారామయ్యగారికి జంకూ గొంకూ యేమీ కలగలేదు. దీన్ని వారు దేశం మీద పడేశారు. కొన్ని పత్రికలు దాన్ని పట్టుకుని వేదాంతార్థాలు తీస్తున్నవి. ఆరవల యింగ్లీషుపత్రికలు ఈసూచనను వెక్కిరిస్తూ వుండినా మన కాంగ్రెస్సుపత్రికలకు దీనిలో వొకనాటికంటే వొకనాడు నమ్మకం పెరిగిపోతూనే వుంది.

చిత్రం.

కాంగ్రెస్సు ఎన్నో పనులు నిర్వహించడానికి అధికారం పుచ్చుకుందిట. ఇలాగ ఆంధ్రరాష్ట్రం వంటి వొక్క విషయంకోసం, కాంగ్రెస్సు, తన బలగించేత రాజీనామాలు పెట్టించడం ఆత్మహత్య వంటిది ట.

ఇదిన్నీ పట్టాభిసీతారామయ్యగారి సూక్తే.

అయితే, యు. పి. బేహారు మంత్రులు ఒక్క రాజకీయఖైదీల విడుదల సందర్భం కోసం మాత్రమే రాజీనామాలు దాఖలు చేశారేం? ఒరిస్సామంత్రులొక్క గవర్నరునియామకం సందర్భంలో మాత్రమే టేబిలులోనుంచి కాగితాలు పైకి తీశారేం?

కాంగ్రెస్సంతా దాన్ని బలాబలీ అని పొగిడేవుందేం?

ఈసంగతులన్నీ జరిగాకే, ఇవన్నీ తమకి బాగా తెలిశాకే పట్టాభిసీతారామయ్యగారిలా రాశారేం?

మరన్నీ వారు.

"ఆంధ్రదేశమున ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెస్సుసంఘముకంటెను గూడ పురాతనమగు సంస్థలు గలవు. ఆంధ్రమహాసభ ౧౯౧౩ వ సంవత్సరమున ప్రారంభమయ్యెను. నాటినుండి నేటివరకును గూడ, ఆంధ్రమహాసభ, ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణము కొరకు పాటుబడుచుండెను. ఆమహాసభాస్థాయిసంఘమువారు ఆంధ్రరాష్ట్రనిర్మాణము విషయమున భారతమంత్రి ప్రకటనచే నేర్పడిన దురభిప్రాయములను తొలగించుటకు తీవ్రమగు ప్రచారమును సాగింపనున్నారని తెలియుచున్నది" అంటున్నారు.

నిజంగా, పట్టాభిసీతారామయ్యగారికింతకంటే చెప్పడానికేం వున్నదీ? కాని యీమాట వారే చెప్పాలా?

దీనివల్ల, కాంగ్రెస్సు చీఫ్ సోకిపంతవరకూ యెవరూ ఆంధ్రరాష్ట్రప్రయత్నాలు చెయ్యడానికి వీలులేదనే కదా తేలుతున్నది?

అయితే:

పట్టాభిసీతారామయ్యగారు తమ ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెస్సు సంఘంతో తృప్తిపడి వూరుకోక ఆంధ్రమహాసభను కూడా యెందు కాక్రమించుకున్నారూ? దానికి కాంగ్రెస్సు మెంబర్నే యెందు కధ్యక్షుణ్ణి చేశారూ? కాంగ్రెస్సు మెంబర్నే సెక్రటరీగా కూడా యెందుకు చేశారూ?

అధ్యక్షులైన అకోటిరెడ్డిగారికీ, సెక్రటరీ అయిన ఆరామాచార్యులుగారికీ కాంగ్రెస్సంటే వుండే శ్రద్ధాసక్తుల్లో సగమైనా వున్నాయా ఆంధ్రమహాసభ అంటేనూ?

ఆంధ్రరాష్ట్రనిర్మాణం జరిగించే పనిమీద వారిద్దరూ లండను వెడతారా? పట్టాభిసీతారామయ్యగారయినా వారిని పంపిస్తారా?

అసలు, ఆంధ్రమహాసభ స్థాయిసంఘంమీద సీతారామయ్యగారిలాంటి భారం మోపడం యేమీ బాగా లేదు.

ఏమంటే? "ఫెడరేషను విషయము పరిష్కారమగువరకును, భారతమంత్రి, భాషాప్రయుక్త రాష్ట్రవిభజనమును నిలిపియుంచునని భావింపవచ్చును. ఫెడరేషను సమస్య పరిష్కారమగుచో ఆంగ్లప్రభుత్వమువారికి కాంగ్రెస్సుతో రాజీ కుదిరినదన్నమాట. అప్పుడెన్ని రాష్ట్రములున్నను, అవి యెంత కాంగ్రెస్సు అభిమానపూరితములై యున్నను బ్రిటిషుప్రభుత్వమువారికి అక్షేపణ యుండదు. రాజీ కుదరని పక్షమున ఫెడరేషనుతో పోరాడు మరి రెండు రాష్ట్రములు క్రొత్తగా సృష్టించుటకు వారంగీకరించరు" అని సీతారామయ్యగారే అంటున్నారు.

అయితే, ఆంధ్రమహాసభాస్థాయిసంఘమువారింక యేమి చేస్తే యేమి లాభమూ?

చివరికి సీతారామయ్యగారి సలహా యేమిటంటే? ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గురించి ఆంధ్రులు కాంగ్రెస్సువర్కింగుకమిటీకి నచ్చచెప్పాలిట.

వెనకటి కెవడో తపస్సు చేసి, దేవుడు ప్రత్యక్షమయి "వరమిస్తాను ఏమి కావాలో కోరుకో" మ్మనగా "మాచేనమాను-

చెవిలో కెంట్రుకలు మొలవాలి, నాకిదే వరం” అన్నాడు ట. ఎవడి చెవిలో, కెంట్రుక లుంటవో వాడి మేనల్లుడికి అష్టైశ్వర్యాలూ పడతవని సాముద్రికంలో యెక్కడో వుంది ట. అలాగ వుందిది.

హిందూమహాసభ ఫెడరేషన్ను అంగీకరించకపోవడం మనకి అపాయకరం అని చెబుతూనే వున్నది కదా, ఇంతకంటే మన ఆంధ్రులు ఫెడరేషనే యెందు కంగీకరించగూడదూ?

ఎటు చూచినా పట్టాభి సీతారామయ్యగారి సలహాలు పూర్తంగా కనపడ్డం లేదు. వాటిలో అర్థం కనపడ్డం లేదు.

ధోరణి చూడగా, వారు, తప్పుదారిలో నేనా పడిపోయి వుండాలి. లేకపోతే కాంగ్రెస్సు నియంతల కన్నెర్రలకో, బుజ్జగింపులకో జంక భ్రాంతులై ఆంధ్రుల నేనా తప్పుదారికి తీస్తూ వుండాలి.

ఏది యేమయినా యిది ప్రశంసాపాత్రం కాదు. ఒక రాష్ట్రానికి సంబంధించిన కాంగ్రెస్సు సంఘానికి అగ్రస్థులైనవారు ఇలా మాట్లాడడం ఆ రాష్ట్రానికి గౌరవకారణం కాదు.

ఇలాంటివారివల్లా, యిలాంటి సూచనలవల్లా యిలాంటి పనులవల్లా ఆంధ్రరాష్ట్రం యెన్నటికీ యేర్పడదు.

ఇంతే కాదు, ఆంధ్రరాష్ట్రం నిర్మించగలిగే మొనగాడు మనలో నాయకుల మనుకునేవారిలో లేనే లేడు. యువకులలో వున్నా రేమో అది కాలక్రమాన గాని తెలవదు.

అలాంటివాడు పుట్టవలసే వుంటే—యిక చెప్పడాని కేం వున్న దీ?

## కృష్ణాపత్రిక దీని కేం చెబుతుందీ?

“భాషాప్రయుక్త రాష్ట్రవిభాగము కాంగ్రెస్సు కార్యక్రమము లోని అంశములలో నొకటి యైనప్పుడు, దానిని సాధింపబూనుట కాంగ్రెస్సు కర్తవ్యము గాదా యని డాక్టరు పట్టాభిగారు తర్కించుచున్నారు. కాంగ్రెస్సు కోరుచున్న సంస్కరణము లింకను చాల గలవు. వాని నన్నిటికొరకు కాంగ్రెస్సు ఇప్పుడు ఆందోళనము సలుపుట లేదు. ౧౯౩౫ ఇండియా చట్టమునకు లోబడి, ప్రోవిన్షియల్ అటానమీ సందర్భమున నియ్యబడిన అధికారములను నిర్వర్తించుటకు మాత్రమే ప్రస్తుత మంగీకరించినది. ఇండియా చట్టమును మార్పించనిదీ చేకూరని సంస్కరణము లెంత వాంఛనీయము లైనను వానిని గూర్చి ప్రస్తుతము ఉపేక్షించుచున్న మాట వాస్తవము. ఈయుపేక్ష నిస్పృహచేత కాదు, కాంగ్రెస్సు తన కర్తవ్యమును మరచుటచేతను గాదు. ఫెడరేషను మనమీద వచ్చి పడనున్న రోజులలో, ౧౯౩౫ ఇండియాచట్టమునందు చిన్న సవరణలను కోరుట అపాయకర మని కాంగ్రెస్సువారి యభిప్రాయము”

౧౫_౯_౩౫ కృష్ణాపత్రిక

అయితే, కాంగ్రెస్సు కార్యసంఘం, ఆంధ్రకర్ణాటకరాష్ట్రాలను విడదీయించే తీర్మానం చెయ్యవలసిం దని మద్రాసు ప్రధాని కెందుకు విధించిందీ?

రెండు రాష్ట్రాలు విడదీయించమని మాత్రమే కాంగ్రెస్సువారుకు మయి వుండగా యేదీ జరక్కుండా వుండాలని నాలుగురాష్ట్రాలను గురించి తీర్మానం చేయించడం అలా వుండగా, ఆతీర్మానం, మద్రాసుప్రధాని యిండియామంత్రికి పంపడం యెందుకు వచ్చిందీ?

ఇది ప్రోవిన్షియల్ అటానమీకి మించిన పని కాదూ?

తాబేదారుని తీసుకువచ్చి గవర్నరుపదవిలో ప్రతిష్ఠించడం కాంగ్రెస్సుమంత్రులకు మానభంగకరం అయితే, కాంగ్రెస్సు నియంతకూడా అయిన కాంగ్రెస్సు మంత్రి పంపిన తీర్మానం యిండియామంత్రి తిరస్కరించెయ్యడం, ఆమంత్రిని పూలతో పూజించి నెత్తెక్కించుకుని వూరేగినట్టా?

దీన్ని పురస్కరించుకుని, కాంగ్రెస్సు, తన శిలస్థైశిత్యం స్మరించుకోవలసిన అగత్యం లేదూ?

ఇది ఆంధ్రులకు సంబంధించిన విషయం కనక—ఆంధ్రులకు పరాభవం కలిగించడం కనక కాంగ్రెస్సు నియంతలు ముసిముసి నవ్వులు నవ్వుకుని వూరుకుని వుండవచ్చు: కానికృష్ణాపత్రిక అయినా కాంగ్రెస్సుయొక్క యీ పతనం గుర్తించిందా?

మితవాదులూ, ఇదివరకు కార్యనిర్వాహణం చేసిన పక్షాలవారూ యిలాగే తీర్మానాలు చేసి సీమ అధికారులకు పంపేవారు. సీమ అధికారులు, వాటికి, ఇప్పుడు మద్రాసు ప్రధాని కిచ్చిన జవాబు వంటి జవాబులే యిచ్చేవారు. అయితే ఆవిధానాన్ని కాంగ్రెస్సు పక్షంవారు ఎన్నివిధాల నిరసించాలో, హేళన చెయ్యాలో, వెక్కిరించాలో, అన్నివిధాలా అవన్నీ చేశారు. మరి తామే యిప్పు డిలాంటి పని చేసి అలాంటి ఫలితం పొందారు? మంచి దయినా చెడ్డ దయినా, మంత్రాంగ బాధ్యత వహించాక, సీమ అధికారులు తమ తీర్మానాలనూ, డిమాండులనూ బుట్టదాఖలు చేస్తే—తిరస్కరిస్తే దొంగను తేలు కుట్టినట్టు యిలాగ పడి వుండడం కాంగ్రెస్సు సంప్రదాయంలో వున్నదా, లేక, “యిది ఆంధ్రుల విషయం కనక యే మయినా మనకి లెక్కలే” దని లోపాయికారీ నిర్ణయం యే మయినా వున్నదా?

## దశమూలారిష్టము

సాటిలేని రసాయనము. ధాతుక్షయము తగ్గించును. చిక్కిపోయిన శరీరమునకు పుష్టి, బలము, వర్చస్సు కలిగించును. అగ్నిమాంద్యము, గ్రహణి, అరుచి, శూల, ఛర్ది పోగొట్టును. వాతవ్యాధులలో చాలా పనిచేయును. శ్వాసకాసలు, క్షయ పోగొట్టును. ఉబ్బు, పాండురోగము, కామల తగ్గించును. ప్రమేహములు, భగందరము, మూలవ్యాధులు జయించును. వాతరక్తము, కుష్ఠు, ఆమవాతము పోనాడును.

స్త్రీల వంధ్యాత్వము పోగొట్టును. ప్రసవించిన తరువాత స్త్రీలకు సంభవించు జ్వరము, అజీర్తి, అతిసారము, గ్రహణి, అరుచి, ఛర్ది వగైరాలకు ఇది అత్యుత్తమైనది. బాలెంతలకు నిజముగా ఇది అమృతము వంటిది. ఏజబ్బును లేకున్నను వారికి దీని నిచ్చుట మంచిది.

పౌను 1—8—0

గంధర్వఫార్మసీ ఇన్నిస్ పేట—రాజమండ్రి.

# హిందీ ముప్పు తెచ్చిపెడుతుంది

"మాకు హిందీ వద్దు"

కాంగ్రెసు ప్రభుత్వంలో యీ మాట రాజద్రోహం అయిపోయింది. ఈమాట అనేవారిని మద్రాసు గవర్నమెంటు కైదు చేస్తున్నది.

ఈ హిందీ నిర్బంధాన్ని నిరసిస్తూ జగదీశన్ వంటి తమిళ దేశ భక్తులు నిరశనవ్రతం పూని మరణశయ్యమీద వున్నారు. "అది మూర్ఖ్యం. వారిని లెక్క చెయ్యగూడదు" అని గాంధిగారు సలహాలిస్తున్నారు.

ఇంతకంటే దౌర్జన్యం యేమి వుంటుందీ?

కాంగ్రెస్సు వుత్తరహిందూదేశీయుల సంస్థ. అనాదినుంచీ వుత్తరహిందూదేశం వేరూ, దక్షిణహిందూదేశం వేరూనూ. ఇది సహజ మైన— భగవన్నిర్దిష్ట మైన విభాగం. చరిత్ర యేమాత్రం తెలిసినవారి కయినా యిది స్పష్టంగా తెలుస్తుంది.

దక్షిణదేశీయులను బానిసలుగా చేసుకోడానికే వుత్తరదేశీయులు కాంగ్రెస్సుని నడుపుతున్నారు. మన మాతృభాషలను చంపడానికే వారిక్కడ బలవంతంగా హిందీని ప్రవేశపెడుతున్నారు.

హిందీ మంచి దనీ, ప్రయోజనకర మనీ బోధించడానికి అయితేనేసి, అరేసికందల పోలీసులూ, గుర్రపురౌతులూ సాయం లేనిదే కాంగ్రెసుమంత్రులు సభలు చేసుకోలేకపోతున్నారు. ఆసభల ప్రాంతాలకు వెళ్లినంత మాత్రాన హింది ప్రతికూలురను అరెస్టు చేయిస్తున్నారు.

ఇది చాలదూ హిందీ దౌర్జన్యంగా వస్తున్న దనడానికీ?

కాంగ్రెస్సుకు వోటు వెయ్యడం యెంత బుద్ధితక్కువ పనో, యెంత మాతృద్రోహమో దక్షిణదేశీయు లిప్పటి కయినా గ్రహించుకోవలసిం దని కోరుతున్నాము.

తెనుగు మంత్రులూ, తెనుగు పత్రికలూ "మా తెనుగు దేశంలో హిందీకి ప్రాతికూల్యం లే" దని వుత్తరాదివారికి నివేదించుకుని ధన్యవాదాలు సంపాదించుకుంటున్నారు. తెనుగుదేశంలో యెక్కడ యేమి వున్నదో, యెక్కడ యేమి జరుగుతున్నదో వారికేం తెలుసునూ?

వారు శుద్ధాంధ్రులు. ఏమీ సందేహం లేదు. అలా కాకపోయి వుంటే వారిని వుత్తరాదివారు చేరనిచ్చే వుండరు. ఏమంటే? శుద్ధాంధ్రు లయినవారే ఆంధ్రం చచ్చిపోవా లని కోరుతున్నట్టూ, హిందీయే కావాలని బుద్ధిస్తున్నట్టూ వుత్తరాదివారికి రకొద్దు కావాలి.

అయితే, తమ మాతృభాషను రక్షించుకోడానికి సాటి అరవలు అలాంటి త్యాగం చేస్తూ వుంటే అది చూసి అయినా తమ మాతృభాషను పూజించుకోవా లని అభిలాష చూపించకపోవడం యీ మూర్ఖాల్ల అధికారదర్పితులకు తగునా?

పోనీ, తెనుగుదేశం సంగతి అలా వుంచి, తమిళదేశంలో హిందీప్రాతికూల్యం ముమ్మరంగా వున్నదే? దాని కేం చెబుతారూ? తమిళులు హిందీని ద్వేషిస్తున్నారు కనక, తమిళదేశంలో అయినా హిందీ నిర్బంధం లేకుండా చేస్తారా వారు?

కాని వా రెవరు ఆపని చెయ్యడానికీ? ఏమి చెయ్యడాని కయినా వారి కేమి అధికారం వున్నదీ? వార్ధాపరిసరాలనుంచి వచ్చే ఆర్డర్లు అమలు జరపడానికే గాని, వారికి, మరి దేని కధికార మున్నదీ?

హిందీప్రాతికూల్యంలో అరవలకు చేయూత యిస్తూవున్న ఆంధ్రవీరుడు రెడ్డినాయుడు గారికి మా ప్రశంసలు విన్నవిస్తున్నాము.

ఆంధ్రుల ప్రాతికూల్యప్రదర్శనానికి విఘ్నేశ్వరపూజ చేసిన గుమ్మిడిదల సుబ్బారావు, పంద్రంగి కేశవరావు, కపిల కాశీపతి గార్లకు మా నమస్కారా లందించుకుంటున్నాము.

మొదట్నుంచీ హిందీయెడల సరియైన—సమగ్రమైన—బలమైన ప్రాతికూల్యం చూపిస్తూ, యీవిషయంలో ఆంధ్రజాతి కంతకీ ప్రాతినిధ్యం వహించివున్న జనవాణిసంపాదకులు తాపీ ధర్మారావునాయుడుగారికి మరీమరీ మాప్రశంసలు నివేదించుకుంటున్నాము.

ఇప్పటికీ మించిపోలేదు. ఆంధ్రు లిప్పటి కయినా హిందీని ఎదుర్కోకపోతే చాలా చిక్కులువస్తా యని గ్రహించి కార్యక్షేత్రంలో వురకవలసిం దని కోరుతున్నాము.

పాపం, కాంగ్రెస్సువారు యిల్లలుకుతున్నారు. అరవల తరవాయి అందుకుని, ఆంధ్రులు, వారికి పండుగు రాకుండా చేస్తా రని నమ్ముతున్నాము.

సంపాదకుడు

# సరస్వతీగ్రంథమండలి

కంభంవారి సత్రమువీధి *** రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్చు అచ్చుతో—ముద్దులొలుకు క్యాలికో బయిండుతో—రెండుమాసముల కొక్క చక్క—ని నవల. నడుమ నడుమ చిన్నచిన్న అనుబంధగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0–4–0 చందాదారులు ఒకేసారి రు 7–8–0 ను ముందుగా పంపినచో వరుసగా ఆరుపుస్తకములు అన్‌రిజిష్టర్డు పార్సిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 11 ప్రేమసుందరి | 1 8 0 | 26 జాగిలము | 1 8 0 | 41 ఛిన్నహస్తము (2 వ భాగము) | 1 8 0 |
| 12 చోరశిఖామణి | 1 8 0 | 27 మొగలాయీదర్బారు 2 భా॥ | 1 8 0 | 42 కంకణరహస్యము | 1 8 0 |
| 13 లక్ష్మీప్రసాదము | 1 8 0 | 28 సరస్వతి | 1 8 0 | 43 సంజీవి (1 వ భాగము) | 1 8 0 |
| 14 హత్యారహస్యము | 1 8 0 | 29 ఆనందాభాయి | 1 8 0 | 44 సంజీవి (2 వ భాగము) | 1 8 0 |
| 51 పాస్టు (1 వ భాగము) | 1 8 0 | 30 హత్యాన్వేషణము | 1 8 0 | 45 వ్రజరాణి | 1 8 0 |
| 16 ఫాస్టు (2 వ భాగము) | 1 8 0 | 31 మొగలాయీదర్బారు 3 భా॥ | 1 8 0 | 46 హత్యాభ్రమ | 1 8 0 |
| 17 కుముద్వతి | 1 8 0 | 32 గంగ | 1 8 0 | 47 కాశీఖండము | 1 8 0 |
| 18 చిన్నకోడలు | 1 8 0 | 33 మొగలాయీ దర్బారు 4 భా॥ | 1 8 0 | 48 సేవాశ్రమము (1 వ భాగము) | 1 8 0 |
| 19 రహస్యభేదనము | 1 8 0 | 34 కోహినూరు | 1 8 0 | 49 సేవాశ్రమము (2 వ భాగము) | 1 8 0 |
| 20 సింహగడము | 1 8 0 | 35 ఆటిన్ మణోలా | 1 8 0 | 50 దాసీకన్య | 1 8 0 |
| 21 మణిహారము | 1 8 0 | 36 అపరిచిత | 1 8 0 | 51 స్త్రీ సాహసము ప్రథమభాగము | 1 8 0 |
| 22 మొగలాయీదర్బారు 1 భా॥ | 1 8 0 | 37 అంతఃపురము (1 వ భాగము) | 1 8 0 | 52 స్త్రీసాహసము 2 వ భాగము | 1 8 0 |
| 23 ఘటనాచక్రము | 1 8 0 | 38 అంతఃపురము (2 వ భాగము) | 1 8 0 | 53 మేరీరాణి | 1 8 0 |
| 24 రాజసుందరి | 1 8 0 | 39 అగ్రహారము | 1 8 0 | 54 రాజ్యలక్ష్మి | 1 8 0 |
| 25 కుంకుమభరణి | 1 8 0 | 40 ఛిన్నహస్తము (1 వ భాగము) | 1 8 0 | 55 లీల | 1 8 0 |

## అనుబంధములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మృత్యుతరంగిణి | 0 12 0 | 10 శ్యామల | 1 0 0 | 19 కథావళి | 1 0 0 |
| 2 అభాగిని | 0 12 0 | 11 కాంతంకథలు (చిన్నకథలు) | 1 0 0 | 20 నాలుగుకథలు | 1 0 0 |
| 3 ఛద్మవేషి | 0 12 0 | 12 కాలసర్పి | 1 0 0 | 21 స్త్రీప్రబోధిక | 1 0 0 |
| 4 విదురుని యుపదేశములు | 1 0 0 | 13 భారతకథాసారం | 1 0 0 | 22 ఆదర్శము (1 వ భాగము) | 0 12 0 |
| 5 కాంచనమాల | 1 0 0 | 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 | 23 ఉపదంపుడు | 0 12 0 |
| 6 సీమంతిని | 1 0 0 | 15 అరక్షణీయ | 1 0 0 | 24 భేతాళకథలు | 0 12 0 |
| 7 సుశీల | 1 0 0 | 16 మాధవి | 1 0 0 | 25 దర్యాప్తులు | 0 12 0 |
| 8 శశిరేఖ | 1 0 0 | 17 లలిత | 1 0 0 | | |
| 9 యమునాబాయి | 1 0 0 | 18 పెండ్లిదండ | 1 0 0 | | |

## నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మార్కండేయ | 0 12 0 | 5 షాజహాను | 1 0 0 | 9 దంపతులు | 1 0 0 |
| 2 అహల్యాశాపవిమోచనము | 0 12 0 | 6 నూర్జహాను | 1 0 0 | 10 విజయవిజయం | 1 0 0 |
| 3 మిహారుపతనము | 1 0 0 | 7 దుర్గాదాసు | 1 0 0 | 11 భక్తకుచేల | 1 0 0 |
| 4 వరమాల | 1 0 0 | 8 చంద్రగుప్త | 1 0 0 | | |

 ఈ గ్రంథములు రాజమండ్రిలో కలాభివర్ధనీ పరిషత్తులోను దొరకును



అచ్చులో నున్నది !

మంచి గ్లేజుకాగితము !

సొగసైన క్యాలికోబైండు

# వస్తుగుణప్రకాశిక

సరస్వతీ పవర్ ప్రెస్,

ప్రచురణము

రాజమండ్రి

పుస్తకములో వస్తుగుణప్రబోధముగల పేజీలు 1000 పైగా నుండును. వెల ప్రతి 1కి రు 5-0-0 లు

ఇది సమస్తద్రవ్యగుణములను అసందిగ్ధముగ తెలియజేయు అపూర్వగ్రంథరాజము. ఆంధ్రవైద్యలోకమునకు, వైద్యేతరులకును మిక్కిలి యుపయోగకర మగునటుల బ్రహ్మశ్రీ ఆయుర్వేదభూషణ భిషగ్వర పండిత వీటూరి వాసుదేవశాస్త్రి. ఏ. యం. ఏ. సి. గారిచే వ్రాయబడినది. ఇందు సందిగ్ధద్రవ్యములన్నియు నిర్ధారణచేయబడి ప్రచురింపబడినవి. నూతనపరిశోధితద్రవ్యములు చేర్చబడినవి. వస్తువునందలి రసవీర్య విపాకప్రభావములను గుణములను విశదీకి వస్తుప్రాధాన్యము నిరూపింపబడినది.

వస్తుగుణప్రకాశిక మాదిరి పేజీ

**సదాప** :—సం. శతపుష్ప - శతాహ్వా— Eng. Peucedanum Graveolens. The fruits Anethum sowa.

**పరిచయుపదములు** : పీతపుష్ప - పచ్చనిపువ్వులుగలది. భూరిపుష్ప విస్తారము పువ్వులుగలది. శతపుష్ప - వందల కొలది పువ్వులుగలది. సూక్ష్మపత్రిక - చిన్న ఆకులుగలది.

స్వరూపము — యిది గుత్తు గుత్తులుగల ఆకుపచ్చని పువ్వులను బూయును. ఒక గుచ్ఛమునకు బహుళపుష్పము లుండును యిది చిన్న క్షుపము. చెట్టున కొక విధమైన సువాసనగలదు. దీని సర్వాంగములు గూడ ఉపయోగకరములైనవి. యిది ఆంధ్రదేశమున అచ్చటచ్చట క్వచిత్తుగా గలదు. దీనిని ఉద్యానవనములలో పెంచుదురు.

గుణములు — ధన్వంతరినిఘంటు : యిది చేదును కారమును గల రుచులుగలది. వేడిచేయు స్వభావముగలది. స్నిగ్ధగుణద్రవ్యము. శ్లేష్మవాతములను హరించును. జ్వరములను నేత్రరోగములను వ్రణములను శమింపజేయును. యిది వస్తికర్మకు శ్రేష్ఠమైనది. (enyma) ఎనీమా.

**ఆకు** : యిది మిక్కిలి వీర్యవృద్ధికరమైనది. తీపిరుచి గలది. గుల్మములను హరించును. వాతహరము, దీపనకారి. స్తన్యమును కఫమును హరించును. రుచిప్రదమైనది.

రాజనిఘంటు : అతిసారమును బోగొట్టునని వ్రాసియున్నాడు. మిగిలినవి ధన్వంతరితో సమానములు.

భావప్రకాశిక : యిది పైత్యకారి. మిగిలినవి సమానములు.

రాజవల్లభుడు : యిది దప్పిని వాంతిని హరించును. మిగిలినవి సమానములు.

ప్రయోగములు — ఎండుమూలములకు :— అనగా శుష్కార్శస్సు రోగములకు, సదాపయు. వసయును కలిపి మెత్తగా నూరి అందు కొంచెము తైలమును గూడ చేర్చి వెచ్చచేసి ఆసనమును కాచిన వేదన శమించును. (చి. 6. అ. దృఢబలుడు)

వాతాధిక వాతరక్తమునకు :— సదాపను పాలతో నూరి పైన లేపనము చేసిన వాతాధికవాతరక్తములు, శూలలు కట్టును. (చి. 26 అ. దృఢబల)

మక్షికావిషమునకు అనగా తేనెటీగల విషమునకు :— సదాపలో సైంధవలవణమును చేర్చి నూరి అందు కొంచెము నేయిని జేర్చి పైన లేపనమొనరించిన మక్షికావిషము హరించును. (వంగసేన)

అజీర్ణములకు :— సదాపాకు 1 తు॥ మిరియాలు 2 తు॥ సైంధవలవణము ½ తు॥ కలిపి ద్రాక్షపండ్లరసముతో మెత్తగా నూరి కందిగింజలంత మాత్రలు కట్టవలెను. యిపి పూటకొక మాత్ర చొ॥ సేవించుచున్న పులిత్రేనుపులతో గూడిన అజీర్ణములు కట్టును.

పిల్లల జ్వరకాసలకు :— రససింధూరమును, రసకర్పూరమును, సదాపాకును సమభాగములుగా కలిపి ఒకదినము తమలపాకులరసమున నూరవలెను. యిది మినపగింజలవలె మాత్రలుగట్టి పిల్లలకు వేయుచున్న జ్వరము, దగ్గు, జలుబు, శ్వాస, డొక్కలు ఎగరవేయుట, కఫవాతములు, అజీర్ణములు మొదలగునవి తగ్గును. దీని యాకును సన్నని గుడ్డను మూటగట్టి మెడలో పిల్లలకు గట్టిన కడుపులోనున్న నులిపురుగులు చచ్చును. సదాపాకును ఎండించి చూర్ణముచేసి 1 గురివిందఎత్తు చూర్ణమును చనుపాలలో గాని, తేనెలో గాని కలిపి యిచ్చిన పిల్లల దగ్గులు హరించును. యిది స్త్రీలయొక్క గర్భమును, హృదయమును బలపరుచును. దీని యాకును మంచినూనెతో కలిపి నూరి పైన వ్రాసిన కఫము పలచబడి ఊపిరాడుటకు వీలగును. గ్రంధులు, శోఫలు తగ్గును. వాయునాశకమైనది. పాచనకారి. వమనమును మదిపొందించును.